# సాహితీ మూర్తుల ప్రశస్తి

## (వివిధకవుల కవితా సంకలనం)

సంకలనకర్త
సంపాదకురాలు

**డా॥ ఎస్. శరత్ జ్యోత్స్నారాణి**

SAHITIMURTHULA PRASASTHI
Collected, Edited by Dr. S. Sarat Jyothsna Rani

ప్రతులు : 500

ప్రచురణ : సెప్టెంబరు, 1997

ముఖచిత్రం : శీలా వీర్రాజు

వెల : రూ. 35.00

ప్రతులకు :

వి. వి. రమణ
1-9-286/2/4/C/4,
ఫ్లాట్ నెం : 101,
నియర్ రామ్‌నగర్ బ్రిడ్జి,
రామ్‌నగర్‌గుండు,
హైదరాబాదు-44.

ముద్రణ :

శివాజీ ప్రెస్,
4-4-53, గంజ్‌బజార్,
సికింద్రాబాదు.

# అంకితం

తెలుగుదేశపు
నవ్యశోభను
నలుదిక్కులా
వెదజల్లిన
దివ్యమూర్తి,
అభినవ ఆంధ్రభోజుడు
కీర్తిశేషులు
పద్మశ్రీ డా॥ నందమూరి తారకరామారావుగారికి.

# విషయసూచిక

విషయము పుట

# తెలుగుతల్లి

—డా॥ ఎస్. టి. జ్ఞానానందకవి

ధర్మధ్వజమ్ము మాధవ వర్మ కాలాన
గగనాంగణములోన నెగురునాడు
తెలుగు యోద్ధల శౌర్యమొలక మల్లారెడ్డి
అరుల సేనలను చెండాడునాడు
కులములంటని చాపకూటి సిద్ధాంతమ్ము
బ్రహ్మనాయండేరుపరచునాడు
పరిమళద్రవ్య సంపాదనా భాండారి
అవచితిప్పయ కీర్తి నందునాడు

"విపుల భక్తి మెఱయ వీరకన్నమనీడు
స్వామి వాక్పథాన సాగునాడు
సుతులలోన గలుగు శూరత్వమునకెంత
పులకరించినావొ! తెలుగు తల్లి!"

కొలపు బాపడు తొట్ట తొలికవి నన్నయ
తెలుగులో కవనమ్ము గిలుకునాడు
దిష్టి తగులకుండ తెనిగింప తిక్కన
జన్మమ్ము నిష్ఠమై సలుపునాడు
మధుర శబ్దవిదుండు మహుడు శ్రీనాధుండు
కంచుఢంకను తన్ను గలుగునాడు
ఘనుడు రాయలచేత గగ్గెరన్ పెద్దన
కొలువులో తొడిగించుకొన్ననాడు

"శాకపాకములను చక్కగా పోతన
వంటయింటిలోన వాణిచేత
నిండు రుచులుదోప వండించుకొనునాడు
త్రేన్చినావు గదవె ? తెలుగుతల్లి !"

పతికి సాయముసేయ బవరాన మాంచాల
పంతాన ఖడ్గమ్ము పట్టునాడు
మగనిలో శౌర్యమ్ము రగిలించి చానమ్మ
అనితలానకు సాగనంపునాడు
కలహభూమిని విరోధులజీల్చి రుద్రమ్మ
తండ్రిపేరును నిల్పి తనరునాడు
పతి మృతి చెవిలోన బడినంత మల్లమ్మ
తమకాన నగ్నిలో దుముకునాడు

"పౌరుషమున బ్రతుకు వీరాంగనలగన్న
భాగ్యశాలినివి ప్రపంచచరిత
కలిగినట్టి నీవు గర్వింపగాజాలు
వెలది మిన్నలమ్మ ! తెలుగుతల్లి !"

అభిరామ హృదయుడౌ యుభరాము కుతుబుషా
తెలుగు గొప్పదనమ్ము నిలుపునాడు
ప్రముఖ భాషావేత్త బ్రౌను విద్వాంసుండు
తెలుగు వాణికి గీర్తి దెచ్చునాడు
మురిసి రాజా రామమోహనరాయలు
తెలుగు వైదికుల స్తుతించునాడు
ఎనలేని హర్షాబ్ధి మునిగి మెగస్తనీస్
తెలుగుల యున్నతిన్ దెలుపునాడు

"మెప్పుకొఱకు గాక యప్పయ్య దీక్షితు
లిజములేని కంఠమెత్తి తెలుగు
బాస కేటికోళ్ళు పలికిన యానాడు
కులికిపోతివెగద ! తెలుగుతల్లి !"

కాలశతాంగ చక్ర గభీర గమనమ్ము
నల పీర బ్రహ్మము దెలుపునాడు
వర్ణకుడ్యాలను పడదన్న వేమన
కవితాయుధముతోడ కదలునాడు
విదవలౌ వారికి వీరేశలింగము
తిరిగి వివాహమ్ము జరుపునాడు
కడుదీనమనుజులన్ గా పాడ బ్రహ్మర్షి
చిత్తశుద్ధిగ కృషిజేయునాడు

"సంమ సంస్కరణము సాధింప గురజాడ
శంఖమెత్తి దెసల జాటునాడు
అంతరమున నెంత హర్షమ్మునందితో
దివ్యభావ వల్లి తెలుగు తల్లి !"

('తెలుగువిద్యార్థి' మాసపత్రిక; జనవరి 1997) సౌజన్యంతో

# అభినందన

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత,
పద్మభూషణ్
డా॥ సి. నారాయణరెడ్డి

ఇటు సాహిత్య పరిశోధనలో, అటు కవితాసాధనలో సరితూకాన్ని పాటిస్తున్న రచయిత్రి డా॥ శరత్ జ్యోత్స్నారాణి.

నన్నయ్యనుంచి నా వరకున్న కొందరు గణనీయాంధ్రకవుల గురించి వరణీయ కవులు విరచించిన రచనలను ఈ సంపుటిరూపంలో అందిస్తున్న శరత్ జ్యోత్స్నకు నా ఆశీరభినందన.

# అభినందన

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షురాలు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు.

ఆధ్యాపకురాలు, పరిశోధకురాలు చిరంజీవి జ్యోత్స్న సంపాదకత్వంలో మరొక చక్కని గ్రంథం వెలువడుతున్నది. ఇది ఒకవిధంగా మంచి ప్రయత్నం. ప్రాచీనాధునిక తెలుగు కవిత్వానికి తమదైన దీప్తులదిక్ దిగంతాలకు ప్రతిభలెత్తిన సుమారు 41 మంది కవులను గురించి సాటి కవులు రచించిన నివాళి కవితలు ఈ సంకలనంలోవున్నాయి. ఇందులో పద్యాలు, వచనకవితలు రెండూవున్నాయి.

ఆదికవి నన్నయతో ప్రారంభించి నారాయణరెడ్డివరకూ స్థూలదృష్టిలో అనేక తరాలకు ప్రాతినిధ్యం కల్పిస్తూ కవులను ఎన్నుకున్నట్లు కనిపిస్తుంది. నిజానికి సాధారణంగా అయితే ఎన్నుకోవడంలో కొంత ఇబ్బందివుంది. ఒక పరిణామాన్ని పాటించినప్పుడు మధ్యలో ప్రసిద్ధుడైన ఒక కవిపై ఇటువంటి నివాళి కవిత లభ్యంకాకపోవచ్చు అయినా సాధ్యమైన మేరకు ఎన్నుకున్న కవులు కవితాయుగాలకు మధ్య ఒకసమన్వయం కనిపిస్తోంది. ఆ రకంగా ఈ ప్రయత్నానికి ప్రాధాన్యత చేకూరింది.

ఇది చిన్నపుస్తకమైనా ముఖ్యంగా చెప్పుకోదగిన అంశాలు కొన్నిఉన్నాయి. కవిత్రయం, శ్రీనాథుడు, పోతన, వేమన, శ్రీకృష్ణదేవరాయలు మొదలుకొని ఆధునిక కవుల వరకు ఇందులోని నివాళికవితల్లో మూలకవుల రచనశక్తి శైలీ దర్శించవచ్చు. ఇది పాఠకుల ఆదరణకుపాత్రం అవుతుందని, కావాలని కోరుకుంటూ సంకలనకర్త జ్యోత్స్నను మనసారా అభినందిస్తున్నాను.

# అభినందనలు

ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యం
ప్రొఫెసర్ : తెలుగుశాఖ
యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్.

సాహితీమూర్తుల ప్రశస్తి అనే పేరుతో ఒక సంకలన కవితా సంపుటిని వెలువరించాలన్న ఊహకు ఆకృతినిచ్చిన సోదరి డా॥ యస్. శరత్ జ్యోత్స్నా రాణిగారి యత్నం అన్ని విధాలా అభినందనీయం.

తెలుగు సాహిత్య సమీక్ష చేసేటప్పుడు "నన్నయనుండి నారాయణరెడ్డి" దాకా అనే ఒక నానుడి లోకంలో ప్రచారంలో ఉంది. దానిని సమర్థిస్తున్నట్లు ఈ సంపుటిలోని ప్రశంసలు నన్నయతో మొదలై నారాయణరెడ్డితో ముగియటం గమనార్హం. సమకాలీనుల సజీవసూక్తికి చక్కని ఆకృతి శిల్పం ఈగ్రంథం !

"ప్రశంస" లనగానే పొగడ్తలు అనే అర్థం ఇప్పుడు రూఢిలో ఉంది. ప్రశంసలో నిజానికి ఒకవ్యక్తిలో ఎన్నదగిన గుణాలగుర్తింపు ప్రకటితమౌతుంది. 'ఆహా ! ఓహోలు !' పొగడ్తలౌతాయి. అందువల్లనే కొన్నిప్రాంతాల్లో పొగడ్తలూ ప్రశంసలూ అని ద్వంద్వంగా వాడతారు. ద్వంద్వంలో ఎప్పుడూ అర్థభేదమున్న మాటలు కనీసం రెండు ఉంటాయి. కాబట్టి ఇవి ప్రశంసలేకాని పొగడ్తలుకావు.

ఒక కవినిగురించి మరొకకవి చేసిన ప్రశంస ఇందులోని ఒక్కొక్క కవిత. మొత్తానికి ఇవి ముఖస్తుతులు కావు. కొందరు కవులు తమకు నచ్చిన, తాము మెచ్చిన కవుల కవితావ్యక్తిత్వాలను కళాత్మకంగా అంచెనా వేసిన విమర్శ కళాఖండాలు అందువల్ల ఈ సంపుటిలోని కవితలన్నీ చదివితే ఆయాకవుల కవితాభివ్యక్తుల కళాతత్త్వాలను తెలుసుకొనే వీలుపడుతుంది. కవులు ఏమి రాశారని చెప్పే కవితలు కావివి; ఎలారాశారని వివేచించే కవితాసూక్తులివి.

సాహిత్యం చదివే విద్యార్థులకూ, అధ్యాపకులకూ, కవితాభిమానం గల

సహృదయులకూ ఈ సంపుటి సంతృప్తితో కూడుకున్న సమ్మోదాన్ని కలిగిస్తుంది. తరం మారినప్పుడెల్లా వెయ్యేళ్ళ సాహిత్యాన్ని కొత్తగా అంచెనా వేసుకోవడం సాహిత్యంలో ఒక పరిపాటి. మరొకసారి అంచెనాకు మార్గదర్శకమయ్యే గ్రంథం ఇది. దీనిని అందిస్తున్న సోదరి డా॥ యస్. శరత్ జ్యోత్స్నారాణిగారికి అభినందనలు.

**

# మదిలోమాట

"జయంతి తే సుకృతి నో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తితేషాం యశః కాయే జరా మరణజం భయం"

కవులు అపరబ్రహ్మలు. వారి కలంలో ఏదో ఒక అనిర్వచనీయమైన శక్తి ఉంటుంది. అది మనల్ని మైమరిపిస్తుంది. మరోలోకాలకు తీసుకొనిపోతుంది. కవులు తమ కమ్మని పలుకులతో మధురకావ్యాలను అందించగలరు. వారికున్న ప్రతిభావ్యుత్పత్తులు, పదప్రయోగవైచిత్రి, నుడికారపు ఇంపుసొంపులు, నిపుణత అట్టివి. వివిధ సన్నివేశ కల్పనలతో నవరసభరితంగా మనల్ని రసజగత్తులో తేలియాడేలా చేయగల సృజనాత్మకత వారిలో ఉంటుంది. దాంతో మేధోసంచలనాన్ని తీసుకొనిరాగలరు. అటువంటి కవుల జీవితాల్ని సాహిత్యంలో భద్రపరచవలసిన బాధ్యత మనదే !

తెలుగులో ఇప్పటికే ఎంతోమంది కవుల చరిత్రలు మరుగున పడిపోకపోతే వారి సాహిత్యదర్శనం మరింత తేటతెల్లమవటానికి సహకరించేది. "కవిదృక్పథం తెలియాలంటే అతని సాహిత్యదర్శనం తెలియాలి. దృక్పథాన్నిబట్టి అతని ప్రస్థానాన్ని గమనించవచ్చు. ప్రస్థానలక్ష్యాన్నిబట్టి ప్రయోగం సాగుతుంది. ప్రయోగం ప్రక్రియలో సాగే అభినవసృజనం, లేదా నవ్యసృష్టి. వీటి పరిణామాల పరిశీలనం సాహిత్యాంశాల నాశ్రయించిన ప్రక్రియయొక్క ఆంతర స్వభావానుశీలనం అవుతుంది" (ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు, పుట : 175) ఇటువంటి వాటిని పరిగణించకుండా చేసే సాహిత్యచరిత్ర, లేదా సాహిత్య వికాస చరిత్ర అసంపూర్ణమే అవుతుంది.

తెలుగు సాహిత్య చరిత్రను తెలుసుకోవటానికి శాసనాలు, కావ్యావతారికలు, ఆశ్వాసాంత గద్యపద్యాలు, లక్షణగ్రంథాలు, వివిధ సంకలన గ్రంథాలు, గ్రంథసూచికలు, కవుల స్వీయచరిత్రలు, జీవితచరిత్రలు, కవులు సాగించిన ఉత్తరప్రత్యుత్తరాలు, జనశ్రుతిని ముఖ్యాధారంగా చేసుకొనే రచనలు కొనసాగటం ఎక్కువగా జరిగింది. వీటితోపాటు ఆయాకవుల సాహితీ ప్రశస్తికి

సంబంధించిన విషయాలు తెలియటంవల్ల సాహిత్యవికాస చరిత్రకు ఎంతో లాభ దాయక మవుతుంది.

ఆచార్య కే. కే. రంగనాథాచార్యులు గారన్నట్లు "ఒక విషయాన్ని అభి వ్యక్తీకరించే పద్ధతిలోని కళాత్మక విలువలను బట్టి ఒకరచనను సాహిత్యం అని, సృజనాత్మక రచన అని అంటున్నమాట నిజమే కాని, అభివ్యక్తీకరణ పద్ధతిని, రచనారూపాన్ని నిర్ణయించేది కవియొక్క సాంఘిక అస్తిత్వం, కవి ఆశించే ప్రయోజనం అని గుర్తించగలిగినప్పుడే నిజమైన సాహిత్య చరిత్ర నిర్మాణం జరుగుతుంది" (తెలుగుసాహిత్యం-మరోచూపు; పుట; xiii) కవిప్రశస్తి ప్రయోజ నాన్నికూడా తెలిపే ఈ అభిప్రాయం ఎంతో విలువైంది.

ఒక కవి, మరొక కవిలోగల ప్రతిభా, వ్యుత్పత్తులకు, తీసుకొనే వస్తువైవిధ్యా నికీ, రచనాశైలికీ, శిల్పనిర్మాణానికి ప్రభావితుడై తనకుగల అభిమానాన్నీ, అభి రుచినీ పద్యంలోగానీ, గేయంలోగాని వ్యక్తీకరించుటయే 'కవిప్రశస్తి'గా నిర్వ చించవచ్చు.

కొంతమంది కవులు రచనలు చేస్తారుకానీ, తమరచనల్లో ఏయే గొప్ప లక్షణాలున్నాయో, అవి తన వ్యక్తిత్వంతో ముడిపడి ఎలా బయటపడ్డాయో చెప్పరు. అవన్నీ ప్రశంస పద్యాలవల్ల చాలావరకూ వెల్లడి అవుతుంటాయి. ప్రశంసచేసే కవిలోని విమర్శకుడు కవిలో, కవి రచనలో నిగూఢంగా దాగిఉన్న లక్షణాల్ని, ఒకవిధంగా చెప్పాలంటే తన ప్రశంసద్వారా అందిస్తాడు.

ఆనాటి భ్రష్ట సమాజాన్ని దుయ్యబట్టిన కవి చౌడప్ప నోటినుండి వచ్చిన 'పెద్దన ఒక్కడేకవి' అనే ప్రశంస పద్యం సాహిత్య చరిత్రలో పెద్దనకవి స్థానం లోని ప్రత్యేకతను తెలియజేస్తుంది.

ఒక కవి రచనను సమగ్రంగా అవగాహన చేసుకోవాలంటే ఆ కవిపై ఏయే కవుల ప్రభావాలు పనిచేశాయో, ఆ రచనకు దారితీసిన పరిస్థితులేమిటో తెలుసుకోకుండా కవిరచనను సంపూర్ణంగా అంచనా వేయలేమనిపిస్తుంటుంది కొన్ని సందర్భాల్లో! ఇది ప్రశంసపద్యాల్ని తాత్కాలికంగా విశ్లేషణ చేసినపుడు మరికొన్ని కొత్తవిషయాలు బయటపడుతుంటాయి. అని అనడానికి మంచి ఉదాహరణ.

నాకు తెలిసినంతవరకూ తెలుగు కవులగురించి పద్య, గేయాల్లో కవుల ప్రశస్తి గ్రంథం (కవులమీద కవులు రాసింది) ఇదే మొట్టమొదటిది.

ఒకేకవి పలువురు కవులను ప్రశస్తిస్తూ ఈ మధ్యనే ఒకటి, రెండు గ్రంథాలు వెలువడినా, అనేకమంది కవులమీద వివిధకవుల ప్రశంసమాత్రం ఇదే!

విశ్వవిద్యాలయంలో విద్యార్థులకు ప్రాచీన, ఆధునిక సాహిత్యాల్నిగురించి బోధించేటపుడు, ఆయా కవులగురించి కావ్యావతారికలు వివరించేటప్పుడు, నాలో కలిగిన ఆలోచనకు కావ్యరూపమే ఈ సాహితీమూర్తుల ప్రశస్తి. ఈ గ్రంథంలో రచనలను కవి జీవితకాలాన్ని బట్టి ఒకక్రమంలో పేర్కొనటం జరిగింది. 'నన్నయ నుండి నారాయణరెడ్డి' వరకూ ఉన్న కవులమీద వచ్చిన ఇతరకవుల ప్రశంసా పద్యాలనే ఎక్కువగా ప్రకటించదలిచినా, కొంతమంది కవులపై ప్రశంసపద్యాలు అచ్చుపని పూర్తి అయిన తర్వాత లభ్యం కావటంతో, అప్పటికే కొన్ని వచన గేయాల్ని ప్రచురించటం, మరికొంతమంది కవుల్ని చేర్చలేకపోవటం జరిగింది. వచన గేయాల్ని ఎన్నిక చేయటంలోకూడా కవుల సంస్మరణాభిలాషవంటివాటిని తెలియజేయటానికి కొంత ఔచిత్యం ఉంటుందనే దృష్టితోకూడా వాటిని ఎన్నిక చేయటం జరిగింది.

కావ్యం రాసినవాడల్లా కవిప్రశస్తిని పొందలేడు. అతను సృష్టించిన ప్రక్రియ ప్రయోగ. శైలీ విన్యాసాలవల్ల తర్వాత కవులకు ఆదర్శప్రాయంగా నిలిచేవాళ్ళు, ప్రజల నాల్కలపై నిలిచేవాళ్లపైనే పద్యాలు విరివిగా వెలువడటం కన్పిస్తుంది. కొంతమంది కవులమీద ప్రశంస పద్యాలే దొరకకపోవటం ఆశ్చర్యకరమైన విషయం !

తెలుగు కవుల చరిత్రలు, రచయితల/రచయిత్రుల చరిత్రలు వచ్చినప్పటికీ, వాటిలో ప్రత్యేకించి ఇటువంటి పద్యాలు, గేయాలతో ప్రచురించటం జరగలేదు. ఇది గమనించిన నేను సాహితీమూర్తుల ప్రశస్తిని తెలుగుతల్లి మెడలో అలంకరించాలనుకున్నాను. అన్వేషణ ప్రారంభించాను. నలభై ఒక్కమంది మీద ప్రశంస పద్యాల్ని ప్రచురించటం, నలభై ఒకటిలో నేను అడుగుపెట్టటం యాదృచ్ఛికంగానే జరిగిన విచిత్రం !

కవుల పుట్టినరోజుల్లోను, మరణించిన సందర్భాల్లోను, షష్టిపూర్తి సంచికల్లోను ఆయా పత్రికల్లో 'ప్రజలు' ప్రకటించిన అభిప్రాయాల్లోనూ 'ప్రశస్తి'ని

అప్రయత్నంగా వెలువరించుటం జరుగుతుంటుంది. వాటిల్లో ఆయాకవులకు సంబంధించిన ఎన్నో శక్తివంతమైన భావాలు దొర్లుకుంటూ వస్తుంటాయి. అవి 'రికార్డ్' కావల్సిన అవసరం ఎంతైనా ఉందనిపించింది. అది మన సాహిత్య సృష్టికి మరింత పరిపుష్టి చేకూర్చగలుగుతుందని భావించి ఈ పని చేపట్టాను.

ప్రశంస పద్యాల్ని గుర్తించేటపుడు కొన్ని జాగ్రత్తల్ని పాటించి నిర్ణయించవల్సి ఉంటుంది.

1. కొంతమంది కవులు కృతిపతి తమగురించి చెప్పినట్లుగా స్వీయ పాండిత్యం, ప్రతిభలను గురించి చెప్పుకోవటం కన్పిస్తుంది. దీన్ని ప్రశంస పద్యంగా లెక్కించనవసరంలేదు.

2. మరికొంతమంది తమ రచనల్లోను, తమలోను ఉన్న విశిష్టలక్షణాల్ని వెల్లడించిన వాటినికూడా ప్రశంస పద్యాలుగా పరిగణించకూడదు.

3. కవి తన శిష్యుల్నికాని, తన గురువుల్నిగాని దీవిస్తూ కీర్తిస్తూ రాసిన పద్యాల్లో ప్రశంస పద్యాలుంటాయి.

4. ముందుమాటల్లో కావ్యం/రచనపట్ల ప్రముఖులు, తమ అభిప్రాయాల్ని వ్యక్తంచేస్తూ ప్రశంస పద్యాల్నికూడా రాస్తుంటారు. అటువంటపుడు కవికి సంబంధించినదా, కవిరాసిన రచనకు సంబంధించినదా అనేది పరిశీలించి నిర్ణయించవలసి ఉంటుంది.

ప్రశంస పద్యాల్ని ఎన్నికచేసుకోవటంలో చాలా జాగ్రత్త వహించాలనే విషయం పై విశ్లేషణవల్ల స్పష్టమవుతుంది.

ఈ గ్రంథాన్ని ప్రచురించాలనే నా ఆలోచనను తెలియజేసిన వెంటనే తమపై వచ్చిన ప్రశంసాపద్యాలను పంపుతూ హర్షాన్ని తెలియజేసిన వారెంతో మంది ఉన్నారు. వారిలో డా. బోయి భీమన్నగారు, ఆచార్య నాయని కృష్ణకుమారిగారు, డా. ఎస్ టి. జ్ఞానానందకవిగారు, డా. గుంటూరు శేషేంద్రశర్మగారు, శ్రీ ఇస్మాయిల్ గారు, శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు వీరందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

తెలుగుతనాన్ని తనువంతా నిల్పుకొని అభినవ ఆంధ్రభోజుడు, ప్రజలమనిషి కీర్తిశేషులు డా॥ ఎన్. టి. రామారావుగారంటే నాకు అభిమానం. ఆ మహా

నీయమూర్తికి చంద్రునికో నూలుపోగన్నట్లు ఈ గ్రంథాన్ని అంకితం చేయటానికి ఎంతో ఆనందిస్తున్నాను.

ఈ 'సాహితీమూర్తుల ప్రశస్తి' గ్రంథానికి 'అభినందనలు' తెల్పిన మానవతామూర్తి, మహామనీషి, విశ్వంభరా వీధుల్లో కవితాపతకాలను ఎగురవేస్తున్న జ్ఞానపీఠ్ అవార్డుగ్రహీత ప్రస్తుత రాజ్యసభ సభ్యులు మాన్యులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను. ఆత్మీయతతో 'అభినందన'లు తెల్పిన మాన్య కవయిత్రి సౌజన్యశీలి శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షురాలు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి నమస్సులు.

తరగని శిష్యవాత్సల్యంతో పరిశోధనరంగంలో కృషిచేయాలని వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ, అనుక్షణం ఆశీర్వదిస్తూ 'అభినందనలు' తెల్పిన గురువర్యులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికి కృతజ్ఞతాభివందనలు.

పరిశోధనారంగంపై ఆసక్తిని కలిగిస్తూ పెద్దమనస్సుతో ఆశీర్వదిస్తూ ఆత్మీయతను చూపిస్తున్న తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య రవ్వా శ్రీహరిగారికి నమస్సులు.

ఈ సంకలనానికి సహాయసహకారాలందించిన శిష్యుడు సహాయసంకలనకర్త, దార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను. ముఖచిత్రం వేసిన శీలా వీర్రాజుగారికి అన్నివేళలా ప్రోత్సహిస్తున్న మావారు వి. వి. రమణగారికి అందంగా అచ్చువేసిన శివాజీ ప్రెస్ అధినేత శ్రీనాగేందర్‌గారికి మరియు బాలాజీ ప్రింటర్స్‌వారికి నా కృతజ్ఞతలు.

డా॥ ఎస్. శరత్ జ్యోత్స్నారాణి.

— —

# నన్నయ్య

సి. నారాయణరెడ్డి

నన్నయ్యా! తెలుగు కవిత
కన్నయ్యా నీ గంటం
చిందించిన ప్రతీ పలుకు
క్షీరాబ్ధికి మేలుకొలుపు.

కథముందా ? అక్షర ర
మ్యతముందా ? రుచిరసూక్తి
కతముందా—ఆ సుగుణ
త్రితయాకృతి నీ సత్కృతి.

నాడు జగద్ధితముగ నీ
నాడులలో ధ్వనియించిన
భారతభారతి నేటికి
ఆరని కపురపుహారతి.

# తిక్కన

సీ॥ "సుకవీంద్ర బృంద రక్షకు డెవ్వడనిన వీఁ
డను నాలుకకుఁ దొడవైన వాఁడు,
చిత్త నిత్యస్థిత శివుఁడెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాడు,
దశదిశలా విశ్రాంతయశుఁ డెవ్వఁడనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్రమైనవాఁడు,
సకల విద్యా కళాచణుఁ డెవ్వఁడనిన వీఁ
డని చూపుటకు గుఱియైన వాఁడు.

తే॥గీ॥ మనుమసిద్ధి మహీశ సమస్తరాజ్య
భార ధౌరేయుఁ డభిరూప భావభవుడు.
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మి సుతుఁడు
దీన జనతా నిధానంబు తిక్కశౌరి॥

సీ॥ సరస కవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొనునమ టధిక కీర్తనకుఁ దెరువు,
లలిత నానా కావ్యములు చెప్ప నుభయ భా
షలయందు ననుట ప్రశంస త్రోవ,
యర్థిమైఁ బెక్కూళ్ళ నగ్రహారంబులఁ
గా నిచ్చు ననుట పొగడ్త పొలము,
మహిత దక్షిణలైన బహువిధ యాగంబు
లొనరించు ననుట వర్ణనము దారి.

తే॥గీ॥ పరున కొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపు సొంపారి నెగడునట్టె
కొమ్మనామాత్యుని తిక్కని కొలది సచివు
లింక నొక్కరు డెన్నంగ నెందు గలడు!"

# కవిపూజ

పోచిరాజు శేషగిరిరావు

సుందర సాహితీ చతుర సూక్తి సుధానిధి! ఎఱ్ఱనార్య! ఏ
విందులు చేసినాడవొ కవిత్వగృహాన పసందు గొల్పగా,
మందిత సూర్యరశ్మి రుచి మన్మణిహారము లీలనప్డు, క
మ్మందన మొందు చిందగ ఉమాపతి భక్తి రసైకలోలుపా!

కానిపించెదవు ప్రగాఢ భక్త్యా వేశ
శివలీల తోడ విశిష్ట ఫణితి
పులకించెదవు వచో విలసనమ్ముల పూర్వ
కావ్యకర్తల సుధాగళిత ధార
వినిపించెదవు మహావిష్ణు గాథా వళి
హరివంశ రచనావసరము నందు
తులకించెదవు కథా ధోరణుల్ నరసింహ
దేవవైభవ గుణోద్దీప్తి మెఱయ

భావుకత పరివేషమై పరిఢవింప
నాద సౌంధర్య గరిమను పాదుకొల్పి
అర్థపుష్టి, యలంకార మందగింప
సరస సారస్వతాంశ ప్రశస్తి కంటె.

కృష్ణ సంసక్త వల్లవీ క్రీడనములు
చిన్ని కృష్ణుని కాలిగజ్జెల రసమ్ము
నందగోవుని ఆనంద చందనమ్ము—
నవశరచ్చంద్ర జ్యోత్స్నల నివతళించె.

స్ఫురదరుణాంశురాగరుచి పొంపిరివో యెడు నీదు రూపమే
అరుదయి యుంట చేతనె మహాకవి! ఎఱ్ఱియ వైతివో-రసో
త్తర కమనీయ వర్ణనలు తామర తంపర లౌటనో! పరం
పరగను వచ్చు బాసకొక మల్పును త్రిప్పుట చేతనో కవీ!

ఏమి పున్నెమ్ము చేసెనో ఈ ధరిత్రి!
కందుకూరి సీమను జన్మగాంచినావు
చదలువాడాన్వయా! శరచ్చంద్ర కీర్తి!
ఎఱ్ఱయి కవీంద్ర! కవితా మహేశ దాస!

ఉన్నత గోత్ర సంభవుడు-ఊర్జిత సత్త్వుడు సత్కవిత్వసం
పన్నయనాభిరాముడు-ప్రభావిభవాంచిత కావ్యవేది-ఎ
ఱ్ఱన్న రచించినాడు గుణరమ్యత సత్యవచో విలాస సం
పన్నత జాలువాఱ రసమాధురి నించి యరణ్య పర్వమున్

విందులు గొల్పినావు రసవీథులఁ దేల్చుచు తెల్గుకైత, గో
విందు కథా మధు ద్రవము ప్రేయము శ్రేయము గూర్చునట్లు, మా
డెందము లందు నిల్పితివి శేవను నీదువచో నుగుంఫ మా
నందము కదళింపగ రణన్మృదు గీతిక లాలపించెడిన్.

సారోదార కవిత్వసంపదలు ప్రజ్ఞావైభవో దారముల్
ఆరాధించితి శంభుపాదముల నత్యంతాను బంధాప్తి, వి
స్ఫారంబుల్ భవదీయ మానసవచో వాగ్వైఖరీ ధోరణుల్
సౌరభ్య ప్రతిభా సముద్రములు ప్రజ్ఞాచక్షు రున్మేషముల్

చేతోమోద మొలర్ప చెప్పితి గుణశ్రేణీ కథారమ్యమై
ఖ్యాతిం గొల్పిన రాఘవేంద్రు కథహర్షా మోదమే పాఱగన్
ఏతద్ గ్రంథము మల్ల భూపతికి నెంతే రక్తి నర్పించితే!
ప్రాతర్వేళ స్మరింపగా వలయు నెఱ్ఱన్నా! భవన్నామమున్

5

నన్నయ తిక్కనార్యుల వినమ్రమతతో స్మరియించినావు ! వి
ద్వన్నుత మౌనటుల్ హృదయదఘ్నముగాగను శంభదాస ! నీ
సన్నుతి శారదా హృదయ సారస రీతి వేలార్చుదే యటం
చెన్నెద రెందరో విబుధు లేమిపటుత్వ కవిత్వ సంపదల్

నన్నయది 'ఋషి' మార్గమై చెన్ను మీరె
తిక్కనది 'రస' మార్గమై తేజరిల్లె
ఉభయ మార్గ ధురీణమై యొదవె నీదు
కవిత భారతారణ్యాన చవులు గూర్చి

ఎంత పుణ్యమ్ము చేసి గడించు కొంటి
వల కవిత్రయ మందు నుజ్జ్వల పదమ్ము !
భారతము తెల్గునాట నెప్పాట నుండు
వంత తాలమ్ము నిల్చు ఎఱ్ఱన్న పేరు.



# రావిపాటి త్రిపురాంతకుడు

శ్రీనాథుడు

నన్నయభట్టు తిక్కకవి నాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరేశ్వరుడన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడె తగునా యిటు దోసపుమాటలాడన్



# నాచన

ఎస్.టి. జ్ఞానానందకవి

కొమ్మనామాత్యునికొడుకు తిక్కనకవి
తేట తెన్గుపదాలబాట నడచి
పరిపూర్ణ సాహితీధ్వనికి మూలమ్ము కుం
తకుని వక్రోక్తి డెందాన తలచి
లలితలావణ్యమంజుల శబ్దకుశలుండు
దండివాఙ్మయవార్ధి తానమాడి
ఘనుడు విద్యారణ్యమునిశిష్యులగు హరి
హరబుక్క రాయల యాత్మనలరి

తరుణ విజయనగరచరితలో మొదటియా
స్థానకవిపదమ్ము దాల్చినట్టి
నవ్యగుణసనాథ! నాచన సోమన!
స్వీకరింపు మివియె చెంగనాలు.

పదవౌ సత్కవితాసరస్వతికి శబ్దబ్రహ్మవై నిల్చి మేల్
పదమాధుర్యమనోజ్ఞ మార్గకవితా వైశిష్ట్యఘంటాపథా
న దమిన్ సాగిన నీ చరిత్రకు మహేంద్రమిత్తిప్పు దర్పించుచు
న్నది సీరాజన మందికోవలయు నన్నా! సాహితీసోమనా!

గుండెకు తాకు తెల్గుపలుకుల్ తనకబ్బముల్లోన నిల్పెను
ద్దండత తీవి నిష్ఠమెయి దాయలగుండెలు దద్దరిల్ల ప్రో
చ్చండమహైక యజ్ఞమును సల్పెను తిక్కన నీవు పిమ్మటన్
రెండవతిక్కసాటియ్యవలె నిల్చితివోయి రసైక భూషణా!

వరునకు రక్షయౌ కుధరనాథునినందన భర్తయైన శం
కరుని పదాలవ్రాలిన యఖండకవీశ్వరు డెఱ్ఱనార్యు బం
ధుర హరివంశకావ్యమును వ్రోసినయట్టుల వ్రాసినాడ వు
త్తరహరివంశమున్ సుకవితారసపోషణ! యోయి! నాచనా!

శంభుదాసుని కథాంశములోని యుద్ధవ
ర్ణనలకు మారువర్ణనల దెలిపి
రచనావిధమ్ములో ప్రతిఘట్టమందు శ
య్యానైగనిగ్యమ్ము లలరజేసి
కాళిదాసుని యుపమాలంకృతికి మెచ్చి
భారవి యర్థసంపదకు మ్రొక్కి
మహిమైక సాహిత్య మర్మ విజ్ఞానసం
బంధి మాఘునితోడ పందెమాడి

పురుషసూక్త మంత్రములను మైనమువోలె
తెలుగుపద్దియముల దించి దించి
యందజేసినట్టి సౌందర్య శబ్దసౌ
రభ్యమునకు నా వరాలగీతి

నీసాహిత్యములోన చోటుగొని రాణించెన్ మునిప్రోక్తభా
షాసౌందర్యకళామతల్లి! ధిషణాసర్వజ్ఞమూర్తి! రసా
భాసత్వానకు తావులేవి ఘనశబ్దబ్రహ్మ! విద్యోతిత
శ్రీసాహిత్యమనోజ్ఞ సంస్కృతి హసించెన్ నీ ప్రమేయమ్మునన్.

నీ సీసాలకు ముగ్ధుడై తనివిసెందెన్ నీ చమత్కారకై
లీసౌగంధ్యధునీతరంగములపాళిన్ డోలలాడెన్ యశ
శ్శ్రీసంపన్నతగాంచె నట్టిఘనుడా శ్రీనాథు డీనేటి మా
యీ, సీసాలకు మార్గదర్శకుడు భాయీ! సంవిధానప్రభూ!

నేర్చెనా సహజపండితుడు పోతనకవి
నీ రచనారమ్య సారసుధలు
కూర్చెనా వాఙ్మయకువలయేక్షణ మహ
త్వనవీనగుణ సనాథత్వగరిమ
మార్చెనా నిను సంగమకులప్రధానుండు
హర్షమ్ముతో సగ్రహారికునిగ
తీర్చెనా సాహితీదీక్షావ్రతమ్ములో
శారద నీలోని సంశయమ్ము

సర్వమానవాళి సమత గాంక్షించుచు
హరిహరులకు కావ్య మంకితమ్ము
నెఱపి జీవితాన గురుపాదులగు తిక్క
యజ్వచరణధూళి నంటినావు.

పరిఖేదంబిడు శైవ వైష్ణవ మతప్రధ్వంస ఝంఝామహో
ద్ధురకాండోద్ధతితాండవార్భటికి నెంతోకుంది నీ కావ్యసుం
దరినిన్ శంకర విష్ణుభేదములకున్ తావీక సర్వోదయ
మ్ము రహిన్ జాటినయట్టి నీదు రచనావ్యూహానకున్ జోతలా.

***

# శ్రీనాథుడు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

ఒడ్డోలంబునం దడ్డ మాకయు లేక
వాక్ప్రహంబు వెల్వఱిచినాఁడు
అష్టదిగ్జయ యశో౽వష్టంభు డిండిమ
భట్టారకుని నోడఁగొట్టినాఁడు
అఖిల విద్వల్లోక మగ్గింపఁగవి సార్వ
భౌమ సద్బిరుదంబుఁ బడసినాఁడు
కవిత మౌక్తిక సభాగారంతరము నందుఁ
గనకాభిషేకంబుఁగాంచినాఁడు

రాజపరమేశ రాజాధిరాజ విభవ
దక్షిణాధీశ దేవరాయ క్షితీంద్ర
రక్షిత బుధాభి భటక "కర్ణాటకటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి"



# శ్రీనాథుడు

కొండేపూడి సుబ్బారావు

తన సాహిత్య వచస్సువర్ణముల నాంధ్రం బెల్ల శోభిల్లజే
సిన సాక్షాత్కవి సార్వభౌమునితనిన్ శ్రీనాథు నేడున్నర్థు ప
న్నునకై నేరము మోపి చంపుదురె! ఆంధ్రుల్ శోకసంతప్తులే
ద్వని రోజుండదు నేటికీకదకు దుర్వారవ్యధాగాధకున్

వరుసగ నీకుదక్క కవివర్య! మఱెవ్వరి కబ్బెనయ్య ఆ
సురుచిర రాజపూజలు యశోవిభవమ్ముల నీదు కీర్తులే
విరిసెను వెన్నెలల్ తెలుఁగు వీధుల నీ కవితావిభూతికి
గురిసెను పండిత ప్రవరకోటి సభ కనకాభిషేకముల్

మధుమాస శృంగార మధుర యౌవనలతే
లో లాని లార్ద్రి సంచాలనములు
ప్రావృడంబోదర ప్రాకార కుహరమ్ము
పెగిలి మార్మోగు గంభీరరవము

హరజటా జృంభితమ్మ త్రిగంగాధర
లవని జారిన ప్రవాహప్రశస్తి
ఆకాశ వీధి విహార కోటీరమ్ము
మధ్యాహ్న వేళా హిమాలయాద్రి
పలుకు నుడికారమున పదప్రౌఢియందు
ధార యందున భావవైదగ్ధ్యమందు
నీ కవిత్వ కళాసృష్టిలో కవీంద్ర
పసిడికోటలు భారతీ భవ్యసతికి

అబ్ధిగర్భములోని ఆణిముత్తెపు వెల్లు
నీ పాండితీ సమున్మేషగరిమ
నీ కావ్య శిల్పమ్ము నింపుకొన్నది సాంధ్య
రాగస్థగిత నవరత్న రాజి
సకలవిజ్ఞాన శాస్త్రాం భోధిబంధించు
భవదీయ పద్య తాత్పర్యసీమ,
కదను తొక్కును పంచకళ్యాణి గుఱ్ఱము
నీ సీసపద్య విన్యాసమందు
నీ కవిత్వ కళాసృష్టిలో కవీంద్ర!
భారతీదేవి శృంగారభరములైన
పల్లకీ లెక్క రుచిర సంపన్న నోజ్ఞ
సాహితీ రమ్యసీమ రాజ్యమ్ము లేలు.

భవ్యభవదీయ ధీషణా ప్రభావసార
సాహితి దివిజకవి పరిషత్తులందు
తెలుగు కవితా మహత్త్వ దీధితులనింప
అరుగు దలచితే శ్రీనాధ-అమరపురికి

నీ కస్తూరియు రత్నభూషణములు నీ హేమపాత్రాన్నముల్
నీకియం గలవారు లేరనుచు చింతింపం దలంపే లస్వ
రోచి కావాస విలాస భోగ విభవారూఢ ప్రభారాజితా
నేక శ్రీలలి యెల్ల నీకగు నీకన్ లిక్కమ్ము బ్రాహ్మీకృపన్

కవనార్ధం బుదయించి నావు కవిలోకం బెల్లఁ గీర్తింప స
త్కవితా భిక్షలొసంగి నావు కవిచంద్రా సీకృతులే విశ్వ సం
స్తవ నీయంబు లొనర్తు రాంధ్రులిక విశ్వాసంబుతో సాహితీ
నవనమ్మందు చిరమ్ము నీ వృథా యశస్సంగీత సంకీర్తనల్

# పోతనామాత్యుడు

గురజాడ రాఘవశర్మ

చక్రమ్మునన్
        గుప్పించు లంఘించు కులుకు పలుకు
మందార మకరంద మాధురీ సంపదు
        న్మత్త భక్తిని హత్తుమాట తేట
అని మొసనబలచే నరి, హరి, నందంద
        నొప్పించు, మెప్పించు, నొప్పుచొప్పు
నడకల గడుసుపోకడల నింతింతయై
        వ్యాపించు భావసంపదల పొందు
విమల గాంధర్వనృత్య గీతముల యేళ
        నమ్ముగావించు, వేణుగానంపుసొంపు
బ్రమ్మకూకటి ముట్టించు పలుకుఁజిలుకు
        పూజ్యతేజోవిరాజు, మాపోతరాజు

ఇతఁడు శుకుండో! వ్యాసుఁడా! గ్రహింపఁగజాలము మాటకిన్ శ్రుతి
స్మృతి హితసూక్తులన్ వెలికిఁ జిందును తేటతెనుంగునన్ గృపా
మతిఁదరియింప నాంధ్రియవి మాటికి పల్కుదురింట నాంధ్ర భా
రతి తన యాడబిడ్డయి నిరంతరమున్ జరియింపఁబోతనా!

కలిగెన్ లోతగు భావసంపదయు, బల్కున్ నేర్పు లెన్నేని జ
న్మల పున్నెమ్ము! ఫలోన్ముఖంబయి సుధామాధుర్య చైతన్య ధా
రల నానంద రస ప్రవాహమయి జారన్, సర్వజీవాళి ని
ర్మల హృత్పద్మము లెల్లలేచి, వికసింపన్ బల్కెదే, పోతనా!

**14**

లలితంబై రసవంతమై సహృదయాహ్లాద ప్రదంబై విరా
జిలు నీ కావ్యపుట ప్రదీపిక గదా శ్రీకృష్ణ లీలాచరి
తులు, కృష్ణాహ్వాయ దివ్యతారక పరబ్రహ్మమ్ము నీ యింటిలో
పల స్వేచ్ఛన్ విహరించి పల్కుటమహాభాగ్యంబహో పోతనా!



# వేమన

బండ్లమూడి సత్యనారాయణ

ఓ కవిచంద్ర! నీ సుకవితోజ్జ్వల మంజుల సాంద్రచంద్రికా
లోక ని మజ్జనంబునకు లోగిన సభ్యజనంబు గాంచి య
స్తోక మదనంబునన్ సుకవి శూరులు గంటములందినారు-నిన్
సోకిన కారు మేఘములు స్రుక్కుచు నిక్కుచు నీల్గె నింతకున్

హాస్యాంకూర మొకండు కన్పడని భాషారణ్యముం జొచ్చి వై
రస్యంబూని చరించు జంతువుల కోరల్ పీకి పోద్రోలి, మేల్
సస్యంబుల్ ఫలింపజేసిన కవీశా! కర్షకోత్తంస! స్వా
రస్యంబైన భవత్ప్రసాదమునె యశ్రాంతంబు నర్థించెదన్.

గోచీపెట్టెను పెట్టలేదనుచు వాగ్యుద్ధంబు గావించి మా
ప్రాచీనుల్ మొలజూచి యేడ్చి; రిక నప్రాచ్యుల్ భవద్వాణిలో
రోచిస్సుల్‌గని గంతువైచిరి, మహర్షుల్‌గారె వారెల్ల? సం
కోచంబేల? యపారభక్తి మెయి నీకున్ వారికిన్ మ్రొక్కెదన్.

నీ నీతుల్ కొరమాలినట్టివని దుర్నీతిన్ విమర్శింపగా
బూనం జెల్లునె? పిల్ల తెమ్మెరలు కంపుందేవె యప్డప్డు? నీ
వానాడున్న సమాజదోషముల బాహాటంబుగా జాటినా;
వౌనా! గంధవహాండ నీ వగుదు వేమన్నా! వితర్కించినన్.

"అకలంకంబు కవిత్వ, మాశయము దివ్యం, బంతరంగంబు స్ఫా
టికమౌ, భావము తీవ్రమౌ, సహజ పాండిత్యంబు, సద్భాష వే
మ కవీంద్రాఖ్యుని" దంచు బల్కిన ఘనుల్, మాన్యుల్ బుధుల్
సత్కవుల్-
"ఒకరా! యిద్దర! మువ్వురా! నలువురా! యున్నార లెందెందరో!"

సంబంధించిన విషయాలు తెలియటంవల్ల సాహిత్యవికాస చరిత్రకు ఎంతో లాభ దాయక మవుతుంది.

ఆచార్య కే. కే. రంగనాథాచార్యులు గారన్నట్లు "ఒక విషయాన్ని అభి వ్యక్తీకరించే పద్ధతిలోని కళాత్మక విలువలను బట్టి ఒకరచనను సాహిత్యం అని, సృజనాత్మక రచన అని అంటున్నమాట నిజమే కాని, అభివ్యక్తీకరణ పద్ధతిని, రచనారూపాన్ని నిర్ణయించేది కవియొక్క సాంఘిక అస్తిత్వం, కవి ఆశించే ప్రయోజనం అని గుర్తించగలిగినప్పుడే నిజమైన సాహిత్య చరిత్ర నిర్మాణం జరుగుతుంది" (తెలుగుసాహిత్యం-మరోచూపు; పుట; xiii) కవిప్రశస్తి ప్రయోజ నాన్నికూడా తెలిపే ఈ అభిప్రాయం ఎంతో విలువైంది.

ఒక కవి, మరొక కవిలోగల ప్రతిభా, వ్యుత్పత్తులకు, తీసుకొనే వస్తువైవిధ్యా నికీ, రచనాశైలికీ, శిల్పనిర్మాణానికీ ప్రభావితుడై తనకుగల అభిమానాన్నీ, అభి రుచినీ పద్యంలోగానీ, గేయంలోగాని వ్యక్తీకరించుటయే 'కవిప్రశస్తి'గా నిర్వ చించవచ్చు.

కొంతమంది కవులు రచనలు చేస్తారుకానీ, తమరచనల్లో ఏయే గొప్ప లక్షణాలున్నాయో, అవి తన వ్యక్తిత్వంతో ముడిపడి ఎలా బయటపడ్డాయో చెప్పరు. అవన్నీ ప్రశంస పద్యాలవల్ల చాలావరకూ వెల్లడి అవుతుంటాయి. ప్రశంసచేసే కవిలోని విమర్శకుడు కవిలో, కవి రచనలో నిగూఢంగా దాగిఉన్న లక్షణాల్ని, ఒకవిధంగా చెప్పాలంటే తన ప్రశంసద్వారా అందిస్తాడు.

ఆనాటి శ్రేష్ఠ సమాజాన్ని దుయ్యబట్టిన కవి చౌడప్ప నోటినుండి వచ్చిన 'పెద్దన ఒక్కడేకవి' అనే ప్రశంస పద్యం సాహిత్య చరిత్రలో పెద్దనకవి స్థానం లోని ప్రత్యేకతను తెలియజేస్తుంది.

ఒక కవి రచనను సమగ్రంగా అవగాహన చేసుకోవాలంటే ఆ కవిపై ఏయే కవుల ప్రభావాలు పనిచేశాయో, ఆ రచనకు దారితీసిన పరిస్థితులేమిటో తెలుసుకోకుండా కవిరచనను సంపూర్ణంగా అంచనా వేయలేమనిపిస్తుంటుంది కొన్ని సందర్భాల్లో ! ఇది ప్రశంసపద్యాల్ని తాత్కాలికంగా విశ్లేషణ చేసినపుడు మరికొన్ని కొత్తవిషయాలు బయటపడుతుంటాయి. అని అనడానికి మంచి ఉదాహరణ.

నాకు తెలిసినంతవరకూ తెలుగు కవులగురించి పద్య, గేయాల్లో కవుల ప్రశస్తి గ్రంథం (కవులమీద కవులు రాసింది) ఇదే మొట్టమొదటిది.

ఒకేకవి పలువురు కవులను ప్రశస్తిస్తూ ఈ మధ్యనే ఒకటి, రెండు గ్రంథాలు వెలువడినా, అనేకమంది కవులమీద వివిధకవుల ప్రశంసమాత్రం ఇదే!

విశ్వవిద్యాలయంలో విద్యార్థులకు ప్రాచీన, ఆధునిక సాహిత్యాల్నిగురించి బోధించేటపుడు, ఆయా కవులగురించి కావ్యావతారికలు వివరించేటపుడు, నాలో కలిగిన ఆలోచనకు కావ్యరూపమే ఈ సాహితీమూర్తుల ప్రశస్తి. ఈ గ్రంథంలో రచనలను కవి జీవితకాలాన్ని బట్టి ఒకక్రమంలో పేర్చానటం జరిగింది. 'నన్నయ నుండి నారాయణరెడ్డి' వరకూ ఉన్న కవులమీద వచ్చిన ఇతరకవుల ప్రశంసా పద్యాలనే ఎక్కువగా ప్రకటించదలిచినా, కొంతమంది కవులపై ప్రశంసపద్యాలు అచ్చువని పూర్తి అయిన తర్వాత లభ్యం కావటంతో, అప్పటికే కొన్ని వచన గేయాల్ని ప్రచురించటం, మరికొంతమంది కవుల్ని చేర్చలేకపోవటం జరిగింది. వచన గేయాల్ని ఎన్నిక చేయటంలోకూడా కవుల సంస్మరణాభిలాషవంటివాటిని తెలియజేయటానికి కొంత ఔచిత్యం ఉంటుందనే దృష్టితోకూడా వాటిని ఎన్నిక చేయటం జరిగింది.

కావ్యం రాసినవారల్లా కవిప్రశస్తిని పొందలేదు. అతను సృష్టించిన ప్రక్రియ ప్రయోగ, శైలీ విన్యాసాలవల్ల తర్వాత కవులకు ఆదర్శప్రాయంగా నిలిచేవాళ్ళు, ప్రజల నాల్కలపై నిలిచేవాళ్లపైనే పద్యాలు విరివిగా వెలువడటం కన్పిస్తుంది. కొంతమంది కవులమీద ప్రశంస పద్యాలే దొరకకపోవటం ఆశ్చర్యకరమైన విషయం!

తెలుగు కవుల చరిత్రలు, రచయితల/రచయిత్రుల చరిత్రలు వచ్చినప్పటికీ, వాటిలో ప్రత్యేకించి ఇటువంటి పద్యాలు, గేయాలతో ప్రచురించటం జరగలేదు. ఇది గమనించిన నేను సాహితీమూర్తుల ప్రశస్తిని తెలుగుతల్లి మెడలో అలంకరించాలనుకున్నాను. అన్వేషణ ప్రారంభించాను. నలభై ఒక్కమంది మీద ప్రశంస పద్యాల్ని ప్రచురించటం, నలభై ఒకటిలో నేను అడుగుపెట్టటం యాదృచ్ఛికంగానే జరిగిన విచిత్రం!

కవుల పుట్టినరోజుల్లోను, మరణించిన సందర్భాల్లోను, షష్టిపూర్తి సంచికల్లోను ఆయా పత్రికల్లో 'ప్రజలు' ప్రకటించిన అభిప్రాయాల్లోనూ 'ప్రశస్తి'ని

అప్రయత్నంగా వెలువరించుటం జరుగుతుంటుంది. వాటిల్లో ఆయాకవులకు సంబంధించిన ఎన్నో శక్తివంతమైన భావాలు దొర్లుతుంటూ వస్తుంటాయి. అవి 'రికార్డ్' కావల్సిన అవసరం ఎంతైనా ఉందనిపించింది. అది మన సాహిత్య సృష్టికి మరింత పరిపుష్టి చేకూర్చగలుగుతుందని భావించి ఈ పని చేపట్టాను.

ప్రశంస పద్యాల్ని గుర్తించేటపుడు కొన్ని జాగ్రత్తల్ని పాటించి నిర్ణయించవల్సి ఉంటుంది.

1. కొంతమంది కవులు కృతిపతి తమగురించి చెప్పినట్లుగా స్వీయ పాండిత్యం, ప్రతిభలను గురించి చెప్పుకోవటం కన్పిస్తుంది. దీన్ని ప్రశంస పద్యంగా లెక్కించనవసరంలేదు.

2. మరికొంతమంది తమ రచనల్లోను, తమలోను ఉన్న విశిష్టలక్షణాల్ని వెల్లడించిన వాటినికూడా ప్రశంస పద్యాలుగా పరిగణించకూడదు.

3. కవి తన శిష్యుల్నికాని, తన గురువుల్నిగాని దీవిస్తూ కీర్తిస్తూ రాసిన పద్యాల్లో ప్రశంస పద్యాలుంటాయి.

4. ముందుమాటల్లో కావ్యం/రచనపట్ల ప్రముఖులు, తమ అభిప్రాయాల్ని వ్యక్తంచేస్తూ ప్రశంస పద్యాల్నికూడా రాస్తుంటారు. అటువంటపుడు కవికి సంబంధించినదా, కవిరాసిన రచనకు సంబంధించినదా అనేది పరిశీలించి నిర్ణయించవలసి ఉంటుంది.

ప్రశంస పద్యాల్ని ఎన్నికచేసుకోవటంలో చాలా జాగ్రత్త వహించాలనే విషయం పై విశ్లేషణవల్ల స్పష్టమవుతుంది.

ఈ గ్రంథాన్ని ప్రచురించాలనే నా ఆలోచనను తెలియజేసిన వెంటనే తమపై వచ్చిన ప్రశంసాపద్యాలను పంపుతూ హర్షాన్ని తెలియజేసిన వారెంతో మంది ఉన్నారు. వారిలో డా. బోయి భీమన్నగారు, ఆచార్య నాయని కృష్ణకుమారిగారు, డా. ఎస్ టి. జ్ఞానానందకవిగారు, డా. గుంటూరు శేషేంద్రశర్మగారు, శ్రీ ఇస్మాయిల్ గారు, శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు వీరందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

తెలుగుతనాన్ని తనువంతా నిల్పుకొని అభినవ ఆంధ్రభోజుడు, ప్రజల మనిషి కీర్తిశేషులు డా॥ ఎన్. టి. రామారావుగారంటే నాకు అభిమానం. ఆ మహా

నియమూర్తికి చంద్రునికో నూలుపోగన్నట్లు ఈ గ్రంథాన్ని అంకితం చేయ టానికి ఎంతో ఆనందిస్తున్నాను.

ఈ 'సాహితీమూర్తుల ప్రశస్తి' గ్రంథానికి 'అభినందనలు' తెల్పిన మాన వతామూర్తి, మహామనీషి, విశ్వంభరా వీధుల్లో కవితాపతకాలను ఎగురవేస్తున్న జ్ఞానపీఠ్ అవార్డ్‌గ్రహీత ప్రస్తుత రాజ్యసభ సభ్యులు మాన్యులు ఆచార్య సి. నారాయణరెడ్డిగార్కి కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను. ఆత్మీయతతో 'అభి నందన'లు తెల్పిన మాన్య కవయిత్రి సౌజన్యశీలి శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షురాలు ఆచార్య నాయని కృష్ణకుమారిగార్కి నమస్సులు.

తరగని శిష్యవాత్సల్యంతో పరిశోధనరంగంలో కృషిచేయాలని వెన్ను తట్టి ప్రోత్సహిస్తూ, అనుక్షణం ఆశీర్వదిస్తూ 'అభినందనలు' తెల్పిన గురువర్యులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగార్కి కృతజ్ఞతాభివందనలు.

పరిశోధనారంగంపై ఆసక్తిని కలిగిస్తూ పెద్దమనస్సుతో ఆశీర్వదిస్తూ ఆత్మీయతను చూపిస్తున్న తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య రవ్వా శ్రీహరిగార్కి నమస్సులు.

ఈ సంకలనానికి సహాయసహకారాలందించిన శిష్యుడు సహాయసంకలన కర్త, దార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను. ముఖచిత్రం వేసిన శీలా వీర్రాజుగార్కి అన్నివేళలా ప్రోత్సహిస్తున్న మావారు వి. వి. రమణగార్కి అందంగా అచ్చువేసిన శివాజీ ప్రెస్ అధినేత శ్రీనాగేందర్‌గార్కి మరియు బాలాజీ ప్రింటర్స్‌వారికి నా కృతజ్ఞతలు.

డా॥ ఎస్. శరత్ జ్యోత్స్నారాణి.

— —

# నన్నయ్య

సి. నారాయణరెడ్డి

నన్నయ్యా! తెలుగు కవిత
కన్నయ్యా! నీ గంటం
చిందించిన ప్రతీ పలుకు
క్షీరాబ్ధికి మేలుకొలుపు.

కథముందా? అక్షర ర
మ్యతముందా? రుచిరసూక్తి
కతముందా—ఆ సుగుణ
త్రితయాకృతి నీ సత్కృతి.

నాడు జగద్ధితముగ నీ
నాడులలో ధ్వనియించిన
భారతభారతి నేటికి
ఆరని కపురపుహారతి.

# తిక్కన

కేతన

సీ॥ "సుకవీంద్ర బృంద రక్షకు డెవ్వడనిన వీఁ
డను నాలుకకుఁ దొడవైన వాఁడు,
చిత్త నిత్యస్థిత శివుఁడెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాడు,
దశదిశలా విశ్రాంతయశుఁ డెవ్వఁడనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్రమైనవాఁడు,
సకల విద్యా కళాచణుఁ డెవ్వఁడనిన వీఁ
డని చూపుటకు గుఱియైన వాఁడు.

తే॥గీ॥ మనుమసిద్ధి మహీశ సమస్తరాజ్య
భార ధౌరేయుఁ డభిరూప భావభవుఁడు.
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మి సుతుఁడు
దీన జనతా నిధానంబు తిక్కశౌరి॥

సీ॥ సరస కవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొనునమ టధిక కీర్తనకుఁ దెరువు,
లలిత నానా కావ్యములు చెప్ప నుభయ భా
షలయందు ననుట ప్రశంస త్రోవ,
యర్థిమైఁ బెక్కూళ్ళ నగ్రహారంబులఁ
గా నిచ్చు ననుట పొగడ్త పొలము,
మహిత దక్షిణలైన బహువిధ యాగంబు
లొనరించు ననుట వర్ణనము దారి.

తే॥గీ॥ పరున కొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపు సొంపారి నెగడునట్టె
కొమ్మనామాత్యుని తిక్కని కొలది సచివు
లింక నొక్కరు డెన్నంగ నెందు గలడు!"

# కవిపూజ

పోచిరాజు శేషగిరిరావు

సుందర సాహితీ చతుర సూక్తి సుధానిధి! ఎఱ్ఱనార్య! ఏ
విందులు చేసినాడవొ కవిత్వగృహాన పసందు గొల్పగా,
మందిత సూర్యరశ్మి రుచి మన్మణిహారము లీలనప్డు, క
మ్మందన మొందు చిందగ ఉమాపతి భక్తి రసైకలోలుపా!

కానిపించెదవు ప్రగాఢ భక్త్యావేశ
శివలీల తోడ విశిష్ట ఫణితి
పులకించెదవు వచో విలసనమ్ముల పూర్వ
కావ్యకర్తల సుధాగళిత ధార
వినిపించెదవు మహావిష్ణు గాథా వళి
హరివంశ రచనావసరము నందు
తులకించెదవు కథా ధోరణుల్ నరసింహ
దేవవైభవ గుణోద్దీప్తి మెఱయ

భావుకత పరివేషమై పరిఢవింప
నాద సౌంధర్య గరిమను పాదుకొల్పి
అర్థపుష్టి, యలంకార మందగింప
సరస సారస్వతాంశ ప్రశస్తి కంటె.

కృష్ణ సంసక్త వల్ల వీ క్రీడనములు
చిన్ని కృష్ణుని కాలిగజ్జెల రసమ్ము
నందగోపుని ఆనంద చందనమ్ము—
నవశరచ్చంద్ర జోత్స్నల నివతరించె.

స్ఫురదరుణాంశురాగరుచి పొంపిరివో యెడు నీదు రూపమే
అరుదయి యుంట చేతనె మహాకవి! ఎట్టియ వైతివో-రసో
త్తర కమనీయ వర్ణనలు తామర తంపర లొటనో! పరం
పరగను వచ్చు బాసకొక మల్పును త్రిప్పుట చేతనో కవీ!

ఏమి పున్నెమ్ము చేసెనో ఈ ధరిత్రి!
కందుకూరి సీమను జన్మగాంచినావు
చదలువాడాన్వయా! శరచ్చంద్ర కీర్తి!
ఎట్టియి కవీంద్ర! కవితా మహేశ దాస!

ఉన్నత గోత్ర సంభవుడు-ఊర్జిత సత్త్వుడు సత్కవిత్వసం
పన్నయనాభిరాముడు-ప్రభావిభవాంచిత కావ్యవేది-ఎ
ట్టిన్న రచించినాడు గుణరమ్యత సత్యవచో విలాస సం
పన్నత జాలువాఱ రసమాధురి నించి యరణ్య పర్వమున్

విందులు గొల్పినావు రసపీథులఁ దేల్చుచు తెల్గుకైత, గో
విందు కథా మధు ద్రవము ప్రేయము శ్రేయము గూర్చునట్లు, మా
డెందము లందు నిల్పితివి తేవను నీదువచో నుగుంఫ మా
నందము కదళింపగ రణన్మృదు గీతిక లాలపించెడిన్.

సారోదార కవిత్వసంపదలు ప్రజ్ఞావైభవో దారముల్
ఆరాధించితి శంభుపాదముల నత్యంతాను బంధాప్తి, వి
స్ఫారంబుల్ భవదీయ మానసవచో వాగ్వైఖరీ ధోరణుల్
సౌరభ్య ప్రతిభా సముద్రములు ప్రజ్ఞాచక్షు రున్మేషముల్

చేతోమోద మొలర్ప చెప్పితి గుణశ్రేణీ కథారమ్య మై
ఖ్యాతిం గొల్పిన రాఘవేంద్రు కథహర్షా మోదమే పొంగగన్
ఏతద్ గ్రంథము మల్ల భూపతికి నెంతే రక్తి నర్పించితే!
ప్రాతర్వేళ స్మరింపగా వలయు నెట్టిన్నా! భవన్నామమున్

5

నన్నయ తిక్కనార్యుల వినమ్రతతో స్మరియించినావు ! వి
ద్వన్నుత మౌనటుల్ హృదయదమ్ముముగాగను శంభదాస ! నీ
సన్నుతి శారదా హృదయ సారస రీతి వేలార్చుచే యటం
చెన్నెద రెందరో విబుధు లేమిపటుత్వ కవిత్వ సంపదల్

నన్నయది 'ఋషి' మార్గమై చెన్ను మీరె
తిక్కనది 'రస' మార్గమై తేజరిల్లె
ఉభయ మార్గ ధురీణమై యొదవె నీదు
కవిత భారతారణ్యాన చవులు గూర్చి

ఎంత పుణ్యమ్ము చేసి గడించు కొంటి
వల కవిత్రయ మందు నుజ్జ్వల పదమ్ము !
భారతము తెల్గునాట నెప్పాట నుండు
నంత తాలమ్ము నిల్చు ఎట్టిన్న పేరు.



# రావిపాటి త్రిపురాంతకుడు

శ్రీనాథుడు

నన్నయభట్ట తిక్కకవి నాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరేశ్వరుడన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాం జలులు నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడె తగునా యిటు దోసపుమాటలాడన్



# నాచన

ఎన్.టి. జ్ఞానానందకవి

కొమ్మనామాత్యునికొడుకు తిక్కనకవి
తేట తెనుగుపదాలబాట నడచి
పరిపూర్ణ సాహితీధ్వనికి మూలమ్ము కుం
తకుని వక్రోక్తి డెందాన తలచి
లలితలావణ్యమంజుల శబ్దకుశలుండు
దండివాఙ్మయవార్ధి తానమాడి
ఘనుడు విద్యారణ్యమునిశిష్యులగు హరి
హరబుక్క రాయల యాత్మనలరి

తరుణ విజయనగరచరితలో మొదటియా
స్థానకవిపదమ్ము దాల్చినట్టి
నవ్యగుణసనాథ! నాచన సోమన!
స్వీకరింపు మివియె చెంగనాలు.

పదనౌ సత్కవితాసరస్వతికి శబ్దబ్రహ్మమై నిల్చి మేల్
పదమాధుర్యమనోజ్ఞ మార్గకవితా వైశిష్ట్యమంటావథా
న దమిన్ సాగిన నీ చరిత్రకు మహేంద్రమిత్రప్ప దర్పించుచు
న్నది సీరాజన మందికోవలయు నన్నా! సాహితీసోమనా!

గుండెకు తాకు తెల్గుపలుకుల్ తనకబ్బములోన నిల్పెను
ద్దండత తీవి నిష్ఠమెయి దాయలగుండెలు దద్దరిల్ల ప్రో
చ్చండమహైక యజ్ఞమును సల్పెను తిక్కన నీవు పిమ్మటన్
రెండవతిక్కసార్యువలె నిల్చితివోయి రసైక భూషణా!

వరునకు రక్షయౌ కుధరనాథునినందన భర్తయైన శం
కరుని పదాలవ్రాలిన యఖండకవీశ్వరు డెఱ్ఱనార్యు బం
ధుర హరివంశకావ్యమును త్రోసినయట్టుల వ్రాసినాడ వు
త్తరహరివంశమున్ సుకవితారసపోషణ ! యోయి ! నాచనా !

శంభుదాసుని కథాంశములోని యుద్ధవ
ర్ణనలకు మారువర్ణనల దెలిపి
రచనావిధమ్ములో ప్రతిఘట్టమందు శ
య్యానైగనిగ్యమ్ము లలరజేసి
కాళిదాసుని యుపమాలంకృతికి మెచ్చి
భారవి యర్థసంపదకు మ్రొక్కి
మహిమైక సాహిత్య మర్మ విజ్ఞానసం
బంధి మాఘునితోడ పందెమాడి

పురుషసూక్త మంత్రములను మైనమువోలె
తెలుగుపద్దియముల దించి దించి
యందజేసినట్టి సౌందర్య శబ్దసౌ
రభ్యమునకు నా వరాలగీతి

నీసాహిత్యములోన చోటుగాని రాణించెన్ మునిప్రోక్తభా
షాసౌందర్యకళామతల్లి ! ధిషణాసర్వజ్ఞమూర్తీ ! రసా
భాసత్వానకు తావులేవి ఘనశబ్దబ్రహ్మ ! విద్యోతిత
శ్రీసాహిత్యమనోజ్ఞ సంస్కృతి హసించెన్ నీ ప్రమేయమ్మునన్.

నీ సీసాలకు ముగ్ధుడై తనివిసెందెన్ నీ చమత్కారతై
లీసౌగంధ్యధునీతరంగములపాళిన్ డోలలాడెన్ యశ
శ్శ్రీసంపన్నతగాంచె నట్టిఘనుడౌ శ్రీనాథు డీనేటి మా
యీ, సీసాలకు మార్గదర్శకుడు బాయీ ! సచ్చిదానంద్రప్రభూ !

నేర్చెనా సహజపండితుడు పోతనకవి
నీ రచనారమ్య సారసుధలు
కూర్చెనా వాఙ్మయకువలయేక్షణ మహ
త్వనవీనగుణ సనాథత్వగరిమ
మార్చెనా నిను సంగమకులప్రధానుండు
హర్షమ్ముతో నగ్రహారికునిగ
తీర్చెనా సాహితీదీక్షావ్రతమ్ములో
శారద నీలోని సంశయమ్ము

సర్వమానవాళి సమత గాంక్షించుచు
హరిహరులకు కావ్య మంకితమ్ము
నెఱపి జీవితాన గురుపాదులగు తిక్క-
యజ్వచరణధూళి నంటినావు.

పరిఖేదంబిడు శైవ వైష్ణవ మతప్రధ్వంస ఝంఝామహో
ద్ధురకాండోద్ధతితాండవార్భటికి నెంతోకుంది నీ కావ్యసుం
దరినిన్ శంకర విష్ణుభేదములకున్ తావీక సర్వోదయ
మ్ము రహిన్ జాటినయట్టి నీదు రచనావ్యూహానకున్ జోతలౌ.

***

వరునకు రక్షయౌ కుధరనాథునినందన భర్తయైన శం
కరుని పదాలవ్రాలిన యఖండకవీశ్వరు డెఱ్ఱనార్యు బం
ధుర హరివంశకావ్యమును త్రోసినయట్టుల వ్రాసినాడ వు
త్తరహరివంశమున్ సుకవితారసపోషణ! యోయి! నాచనా!

శంభుదాసుని కథాంశములోని యుద్ధవ
ర్ణనలకు మారువర్ణనల దెలిపి
రచనావిధమ్ములో ప్రతిఘట్టమందు శ
య్యానైగనిగ్యమ్ము లలరజేసి
కాళిదాసుని యుపమాలంకృతికి మెచ్చి
భారవి యర్థసంపదకు మ్రొక్కి
మహిమైక సాహిత్య మర్మ విజ్ఞానసం
బంధి మాఘునితోడ పందెమాడి

పురుషసూక్త మంత్రములను మైనమువోలె
తెలుగుపద్దియముల దించి దించి
యందజేసినట్టి సౌందర్య శబ్దసౌ
రభ్యమునకు నా వరాలగీతి

నీసాహిత్యములోన చోటుగాని రాణించెన్ మునిప్రోక్తభా
షాసౌందర్యకళామతల్లి! ధిషణాసర్వజ్ఞమూర్తీ! రసా
భాసత్వానకు తావులేని ఘనశబ్దబ్రహ్మ! విద్యోతిత
శ్రీసాహిత్యమనోజ్ఞ సంస్కృతి హసించెన్ నీ ప్రమేయమ్మునన్.

నీ సీసాలకు ముగ్ధుడై తనివిసెందెన్ నీ చమత్కారకై
ళీసౌగంధ్యధునీతరంగములపాళిన్ డోలలాడెన్ యశ
శ్రీసంపన్నతగాంచె నట్టిఘనుడౌ శ్రీనాథు డీనేటి మా
యీ, సీసాలకు మార్గదర్శకుడు భాయీ! సంవిదానప్రభూ!

9

నేర్చెనా సహజపండితుడు పోతనకవి
నీ రచనారమ్య సారసుధలు
కూర్చెనా వాఙ్మయకువలయేక్షణ మహ
త్వనవీనగుణ సనాథత్వగరిమ
మార్చెనా నిను సంగమకులప్రధానుండు
హర్షమ్ముతో నగ్రహారికునిగ
తీర్చెనా సాహితీదీక్షావ్రతమ్ములో
శారద నీలోని సంశయమ్ము

సర్వమానవాళి సమత గాంక్షించుచు
హరిహరులకు కావ్య మంకితమ్ము
నెఱపి జీవితాన గురుపాదులగు తిక్క
యజ్వచరణధూళి నంటినావు.

పరిఖేదంబిడు శైవ వైష్ణవ మతప్రధ్వంస ఝుంఝూమహో
ద్ధురకాండోద్ధతితాండవార్భటికి నెంతోకుంది నీ కావ్యసుం
దరినిన్ శంకర విష్ణుభేదములకున్ తావీక సర్వోదయ
మ్ము రహిన్ జాటినయట్టి నీదు రచనావ్యూహానకున్ జోతలా.

***

# శ్రీనాథుడు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

ఒడ్డోలంబునం దడ్డ మాకయులేక
వాక్ప్రహంబు వెల్వఱిచినాఁడు
అష్టదిగ్జయ యశోఽవష్టంభు డిండిమ
భట్టారకుని నోడఁగొట్టినాఁడు
అఖిల విద్వల్లోక మగ్గింపఁగవి సార్వ
భౌమ సద్బిరుదంబుఁ బడసినాఁడు
కవిత మౌక్తిక సభాగారంతరము నందుఁ
గనకాభిషేకంబుఁగాంచినాఁడు

రాజపరమేశ రాజాధిరాజ విభవ
దక్షిణాధీశ దేవరాయ క్షితీంద్ర
రక్షిత బుధాభి భటక “కర్ణాటకటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి”



# శ్రీనాథుడు

కొండేపూడి సుబ్బారావు

తన సాహిత్య వచస్సువర్ణముల నాంధ్రం బెల్ల శోభిల్లజే
సిన సాక్షాత్కవి సార్వభౌమునితనిన్ శ్రీనాథు నేడ్నూర్లు ప
న్నునకై నేరము మోపి చంపుదురె! ఆంధ్రుల్ శోకసంతప్తులే
ద్వని రోజుండదు నేటికీకథకు దుర్వారవ్యథాగాథకున్

వరుసగ నీకుదక్క కవివర్య! మఱెవ్వరి కబ్బెనయ్య ఆ
సురుచిర రాజపూజలు యశోవిభవమ్ములు నీదు కీర్తులే
విరిసెను వెన్నెలల్ తెలుగు వీధుల నీ కవితావిభూతికి
గురిసెను పండిత ప్రవరకోటి సభ కనకాభిషేకముల్

మధుమాస శృంగార మధుర యౌవనలలే
తో లాని లార్ద్రి సంచాలనములు
ప్రావృడంభోధర ప్రాకార కుహరమ్ము
వెగిలి మార్మోగు గంభీరరవము

హరజటా జృంభితమ్ము త్రిగంగాధర
లవని జారిన ప్రవాహప్రశస్తి
ఆకాశ వీధి విహార కోటీరమ్ము
మధ్యాహ్న వేళా హిమాలయాద్రి
పలుకు నుడికారమున పదప్రౌఢియందు
ధార యందున భావవైదగ్ధ్యమందు
నీ కవిత్వ కళాసృష్టిలో కవీంద్ర
పసిడికోటలు భారతీ భవ్యసతికి

అబ్ధిగర్భములోని ఆణిముత్తెపు వెల్లు
నీ పాండితీ సమున్మేషగరిమ
నీ కావ్య శిల్పమ్ము నింపుకొన్నది సాంధ్య
రాగస్థగిత నవరత్న రాజి
సకలవిజ్ఞాన శాస్త్రాం భోధిబంధించు
భవదీయ పద్య తాత్పర్యసీమ,
కదను తొఁక్కును పంచకళ్యాణి గుఱ్ఱము
నీ సీసపద్య విన్యాసమందు
నీ కవిత్వ కళాసృష్టిలో కవీంద్ర!
భారతీదేవి శృంగారభరములైన
పల్లకి లెక్కి రుచిర సంపన్నసోజ్ఞ
సాహితీ రమ్యసీమ రాజ్యమ్ము లేలు.

భవ్యభవదీయ ధీషణాప్రభావసార
సాహితి దివిజకవి పరిషత్తులందు
తెలుగు కవితా మహత్త్వ దీధితులనింప
అరుగు దలచితే శ్రీనాధ-అమరపురికి

నీ కస్తూరియు రత్నభూషణములు నీ హేమపాత్రాన్నముల్
నీకియం గలవారు లేరనుచు చింతింపం దలంపే లన్వ
ర్పో కావాస విలాస భోగ విభవారూఢ ప్రభారాజితా
నేక శ్రీలలి యెల్ల నీకగు నీకన్ లిక్కమ్ము బ్రాహ్మీకృపన్

కవనార్థం బుదయించి నావు కవిలోకం బెల్లఁ గీర్తింప స
త్కవితా భిక్షలొసంగి నావు కవిచంద్రా నీకృతులే విశ్వ సం
స్తవ నీయంబు లొనర్తు రాంధ్రులిక విశ్వాసంబుతో సాహితీ
నవనమ్మందు చిరమ్ము నీ వృథా యశస్సంగీత సంకీర్తనల్



# పోతనామాత్యుడు

గురజాడ రాఘవశర్మ

చక్రమ్మునన్
        గుప్పించు లంఘించు కులుకు పలుకు
మందార మకరంద మాధురీ సంపదు
        న్మత్త భక్తిని హత్తుమాట తేట
అని మొసనబలచే నరి, హరి, నందండ
        నొప్పించు, మెప్పించు, నొప్పుచొప్పు
నడకల గడుసుపోకడల నింతింతయై
        వ్యాపించు భావసంపదల పొందు
విమల గాంధర్వనృత్య గీతముల యేళ
        నమ్మగావించు, వేణుగానంపుసొంపు
బ్రస్మకూకటి ముట్టించు పలుకుఁజిలుకు
        పూజ్యతేజోవిరాజు, మాపోతరాజు

ఇతఁడు శుకుండో! వ్యాసుఁడా! గ్రహింపఁగఁజాలము మాటకివ్ శ్రుతి-
స్మృతి హితసూక్తులన్ వెలికిఁ జిందును తేటతెనుంగునన్ గృపా
మతిఁదరియింప నాంధ్రియవి మాటికి పల్కుదురింట నాంధ్ర భా
రతి తన యాదబిడ్డయి నిరంతరమున్ జరియింపఁబోతనా!

కలిగెన్ లోతగు భావసంపదయు, బల్కన్ నేర్పు లెన్నేని జ
న్మల పున్నెమ్మ! ఫలోన్ముఖంబయి సుధామాధుర్య చైతన్య ధా-
రల నానంద రస ప్రవాహమయి జారన్, సర్వజీవాళి ని
ర్మల హృత్పద్మము లెల్లలేచి, వికసింపన్ బల్కెదే, పోతనా!

**14**

లలితంబై రసవంతమై సహృదయాహ్లాద ప్రదంబై విరా
జిలు నీ కావ్యపుట ప్రదీపిక గదా శ్రీకృష్ణ లీలాచరి
తులు, కృష్ణాహ్వాయ దివ్యతారక పరబ్రహ్మమ్ము నీ యింటిలో
పల స్వేచ్ఛన్ విహరించి పల్కుటమహాభాగ్యంబహో పోతనా!



# వేమన

*బండ్లమూడి సత్యనారాయణ*

ఓ కవిచంద్ర! నీ సుకవితోజ్జ్వల మంజుల సాంద్రచంద్రికా
లోక ని మజ్జనంబునకు లోగిన సభ్యజనంబు గాంచి య
స్తోక మదనంబునన్ సుకవి శూరులు గంటములందినారు-నిన్
సోకిన కారు మేఘములు స్రుక్కుచు నిక్కుచు నీల్గె నింతకున్

హాస్యాంకూర మొకండు కన్పడని భాషారణ్యముం జొచ్చి వై
రస్యంబూని చరించు జంతువుల కోరల్ పీకి పోద్రోలి, మేల్
సస్యంబుల్ ఫలింపజేసిన కవీశా! కర్షకోత్తంస! స్వా
రస్యంబైన భవత్ప్రసాదమునె యశ్రాంతంబు నర్థించెదన్.

గోచీపెట్టెను పెట్టలేదనుచు వాగ్యుద్ధంబు గావించి మా
ప్రాచీనుల్ మొలజూచి యేడ్చి; రిక నప్రాచ్యుల్ భవద్వాణిలో
రోచిస్సుల్ గని గంతువైచిరి, మహర్షుల్ గారె వారెల్ల? సం
కోచంబేల? యపారభక్తి మెయి నీకున్ వారికిన్ మ్రొక్కెదన్.

నీ నీతుల్ కొరమాలినట్టివని దుర్నీతిన్ విమర్శింపగా
బూనం జెల్లునె? పిల్ల తెమ్మెరలు కంపుందేవె యప్డు? నీ
వానాడున్న సమాజదోషముల బాహాటంబుగా జాటినా;
వౌనా! గంధవహాండ నీ వగుదు వేమన్నా! వితర్కించినన్.

"అకలంకంబు కవిత్వ, మాశయము దివ్యం, బంతరంగంబు స్ఫా
టికమౌ, భావము తీవ్రమౌ, సహజ పాండిత్యంబు, సద్భాష వే
మ కవీంద్రాఖ్యుని" దంచు బల్కిన ఘనుల్, మాన్యుల్ బుధుల్
సత్కవుల్-
"ఒకరా! యిద్దర! మువ్వురా! నలువురా! యున్నార లెందెందరో!"

14

లలితంబై రసవంతమై సహృదయాహ్లాద ప్రదంబై విరా
జిలు నీ కావ్యపుట ప్రదీపిక గదా శ్రీకృష్ణ లీలాచరి
తులు, కృష్ణాహ్వాయ దివ్యతారక పరబ్రహ్మమ్ము నీ యింటిలో
వల స్వేచ్ఛన్ విహరించి పల్కుటమహాభాగ్యంబహో పోతనా!



# వేమన

*బండ్లమూడి సత్యనారాయణ*

ఓ కవిచంద్ర! నీ సుకవితోజ్జ్వల మంజుల సాంద్రచంద్రికా
లోక ని మజ్జనంబునకు లోగిన సభ్యజనంబు గాంచి య
స్తోక మదనంబునన్ సుకవి శూరులు గంటములందినారు-నిన్
సోకిన కారు మేఘములు స్రుక్కుచు నిక్కుచు నీల్గె నింతకున్

హాస్యాంకూర మొకండు కన్పడని భాషారణ్యముం జొచ్చి వై
రస్యంబూని చరించు జంతువుల కోరల్ పీకి పోద్రోలి, మేల్
సస్యంబుల్ ఫలింపజేసిన కవీశా! కర్షకోత్తంస! స్వా
రస్యంబైన భవత్ప్రసాదమునె యశ్రాంతంబు నర్థించెదన్.

గోచీపెట్టెను పెట్టలేదనుచు వాగ్యుద్ధంబు గావించి మా
ప్రాచీనుల్ మొలజూచి యేడ్చి; రిక నప్రాచ్యుల్ భవద్వాణిలో
రోచిస్సుల్ గని గంతువైచిరి, మహర్షుల్ గారె వారెల్ల? సం
కోచంబేల? యపారభక్తి మెయి నీకున్ వారికిన్ మ్రొక్కెదన్.

నీ నీతుల్ కొరమాలినట్టివని దుర్నీతిన్ విమర్శింపగా
బూనం జెల్లునె? పిల్ల తెమ్మెరలు కంపుందేవె యప్డప్డు? నీ
వానాడున్న సమాజదోషముల బాహాటంబుగా జాటినా;
వౌనా! గంధవహాండ నీ వగుదు వేమన్నా! వితర్కించినన్.

"అకలంకంబు కవిత్వ, మాశయము దివ్యం, బంతరంగంబు స్ఫా
టికమౌ, భావము తీవ్రమౌ, సహజ పాండిత్యంబు, సద్భాష వే
మ కవీంద్రాఖ్యుని" దంచు బల్కిన ఘనుల్, మాన్యుల్ బుధుల్
సత్కవుల్-
"ఒకరా! యిద్దర! మువ్వురా! నలువురా! యున్నార లెందెందరో!"

అలతి యలంతి విత్తుల మహావటవృక్షము లుద్భవించి పాం
థుల శ్రమ మాహరించి పరితోష మొసంగు విధంబుగాగ-నీ
యలతి యలంతి శబ్దములయందు మహార్థము లుల్లసిల్లి మా
తెలుగుల నేలికొన్నవి సుధీవర! సర్వజగంబు మెచ్చగన్.

ఆటవెలంది నిన్ వలచినంతగ మమ్ముఁ వరింపబోవ దా
రాటమెకాని-నీ పగిది రత్నవిభూషలు, జిల్గు వస్త్రముల్
మాటికి మాటి కీయ గలమా? కలమాన్నము పెట్ట నేర్తుమా?
గాటపు కౌగిటన్ బ్రణయ కంధిని దేల్పగ మాకు శక్యమా?

నీ కన్నన్ రసవత్కవీంద్రులు, బుధుల్, నీ కన్న సర్వజ్ఞులున్
నీ కన్నన్ పరిపూర్ణ భోగరతులున్, నీ కన్న నిస్సంగులున్
మా కున్నారు పరశ్శతంబుగ మహాత్మా! యేమి కర్మంబొ! యీ
లోకం బేమియు పట్టకుండెదరు పైలోకంబు లూహించుచున్.

నీ వటుగాదు-మానవుడె నీ యితివృత్తము; నీ యఖండ ప
ద్యావళి నిండ సర్వసమతానినదంబె, స్వతంత్రశంఖ సం
రావమె, సాంఘికాభ్యుదయ రాగమె సాగి ప్రతిధ్వనించు, నాం
ధ్రావళి మోజుపడ్డ కవివయ్య! ప్రజాకవివన్న నీ వయా!

కులమత జాతి భేదములు కూలు, సమత్వము రాజ్యమేలు, నీ
కలలు ఫలించు, సోదరుల కాంక్షలు దీరు, నవీనధారతో
జ్వలసతి కీర్తి దిక్కులకు బ్రాకు; నుతింతురు సత్కవీంద్రు లా
జలజవిలోచనన్ సరళసంబున; నిశ్చయ మిద్ది వేమనా!

# కృష్ణదేవరాయలు

—వాఘవా

ఆంధ్రుల భావనాట్యస్థానముల లోన
నాడు నీ కావ్యకన్యకల నరసి
యనిఁ గన్నుమాయ కింకనుఁ దోచు నీ సమి
త్కంఖాణఖురశికాంకములఁ జూచి
కలితశౌర్యజ్వాలఁ గరఁగించి పోసిన
జయశాసనస్థిరాక్షరము లెంచి
పెద్దనార్యునిచిత్త వీథి కందక దాఁటి
దిశలఁ దాండవమాడు తేజ మెంచి

చిరము నీ రాజ్యలక్ష్మి వర్షించుబాష్ప
పూర మదె! తుంగభద్రాఖ్యఁ బూని పారు
చుండు నిప్పుడు బళ్ళారి మండలమున
నాంధ్రకవిచంద్ర కృష్ణరాయక్షితీంద్ర!

మహితాంధ్రభోజనామకరత్నము వహించి
క్రాలు విశాలవక్షస్థలంబు
పరభీకరప్రభావమ్ము బయ ల్జిమ్ము
నరిలేని కోరమీసములజంట
చతురబ్ధివలయితక్ష్మాభారమునకుఁ బెం
పున నిక్కి కనుచుండు భుజయుగంబు
దురమున నిప్పులు గురిసి, దీనులయందు
దయను గుంభించు నేత్రద్వయంబు

అష్టదిగ్గజవాగమృతార్ద్ర మగుచుఁ
బావనం బైన నీ సభాభవన విభవ
మక్కటా! జీర్ణనగరకుడ్యాంతరములఁ
బండి నిద్రించెనేః కృష్ణపార్థివేంద్ర !

భాషాసముద్రకుంభప్రభవుఁడ వయ్యు
విద్వత్కవుల గారవించినావు
ప్రతిపక్షరాజభార్గవరాముఁడవ యయ్యు
వెన్నిచ్చుచో విడిపించినావు
వైరిరాణ్మకుటఘంటత్పదాబ్జుఁడ వయ్యు
పెద్దన్నపదము సేవించినావు
ఆర్తార్థిజనకల్పకానోకహమ వయ్యు
సత్కృతులకుఁ జేయిసాఁచినావు

ఔర! శ్రీకృష్ణరాయ! నీయంతవాని
దివికి నర్పించుకొన్న మా దేశజనుల
భాగ్యహీనత నొక్కి చెప్పంగలేక
చిలువరాయఁడు వేయినాల్కలు వహించె !

కవివరేణ్యులు నీకుఁగా సృష్టిఁ గావించు
కృతికన్యకలను దుఃఖితలఁ జేసి
నావాడపతిశకంథరుఁ డాదినృపు లంపు
కానుకబండ్లు వెనక్కు మఱల్చి
ముదురువెన్నెలఁ గాయు ముత్యాలగద్దియఁ
బరరాజధూర్తులపాలు చేసి
నిరతంబుఁ బగఱనెత్తురుచేరుల మునుంగు
కత్తి కాఁకటిచిచ్చుఁ గలుగఁ జేసి

కుడియెడమలను నీతోడఁ గూడి తిరుగు
సుకవికులకోకిలంబుల శోకజలధి
ముంచి, యల బృహస్పతిఁ వాతఁ మంచి దగుట
దివికిఁ బోయితె? శ్రీకృష్ణదేవరాయ?

అయుతవర్ణనావిభవ మచ్చుపడం బనిపూని విష్ణు చి
త్తీయము వ్రాసినావు కవిధీరులగుండెలు తల్లడిల్ల; నేఁ
డీ, యొకఁడేని మీసముపయిం జెయివైచి, రచించు సత్కవి
ధ్యేయుఁడు? క్లిష్టకావ్య మనకేమి యశక్తులు కృష్ణభూపతీ!

ఆశీర్వదించినారా, వ్యాసవాల్మీకి
బృందారకమునీంద్రు లెదురువచ్చి?
కన్నావె, కవిభయంకరుఁ గాళిదాసు? బో
జుం డున్నవాఁడె విశ్రుతగుణుండు?
రంభ నీతోడఁ గేరడ మాడునే? దానఁ
గోపించునే నలకూబరుండు?
బలభేది వేయిగన్నులఁ జూచి నిను గౌర
వించుచున్నాఁడె కోవిదులలోన?

తిరుగ నీ నెయ్యపుంగవీశ్వరులగోష్ఠి
జరుగుచున్నదె దేవేంద్రపురమునందు?
నెచట నుండిన నేమి, శ్రీకృష్ణరాయ!
భరతపుత్రుల నొకకంట నరయుమయ్య!

# సూరనార్య మహాకవి

—కె. టి. యల్. నరసింహాచార్యులు

అలకళాపూర్ణు కథ నెంతొ యబ్బురముగ
నవరసాకృతి సుందరనవల యనగ
సృష్టి చేసిన నీ మేధచిద్విలాస
మెట్టిదని చెప్పనొప్పు నీమేటి సుకవి!

నవలల వన్నెలు చిన్నెలు
నవల న్నాటకపురీతు లాహ్లాదముగా
నవలంబించి రచించితి
నవలాలిత్యంబు మీఱ నవరసరసికా!

ఆంధ్రకావ్యంబు లన్నింటి నతిశయించి
మామనస్సును హరియించె మహితశైలి
నీదు కావ్యంబు రస మతినిర్మలమ్ము
అందు పాత్రశిల్పంబు నద్భుతంబు.

షేక్స్పియర్ కవి వర్ణించె చిత్రగతిని
*కవలల వినోదనాటకగాథ దాని
గూడ మించితి వయ్యారె గూఢవస్తు
విన్యసనపద్ధతిని సూక్ష్మవీక్షణమున.

కలభాషిణి కలగానము
నలకూబరుఁ గూడఁజేయు నటనంబున్, మా

---

*కామెడీ ఆఫ్ ఎరర్స్.

యలు పన్నుటయును మాహృది
వెలలవు మఱి దలపఁ దలప వేడుకె పుట్టున్.

అలసుగాత్రిచరిత్ర మంద మౌనట్లుగా
మలచినావు నీవు-మరచినాము
మేను లేమది విని మివులంగ మెచ్చితి
మయ్య సుకృతి, నిన్ను మాన్యవర్య.

తెలుగులో మాత్రమే గాదు వెలుగుచున్న
విశ్వభాషలలో గూడ వింతయైన
యిట్టి కావ్యంబు లేదని యెల్లవారు
భావుకత్వంబు మీఱగాఁ బలికినారు.

ఎన్ని మారులు చదివిన నింత యేని
దుష్టిఁ గనఁజాలరు కదయ్య శిష్టవరులు
ఇట్టి నీకిదె వందనం బిద్ధశిల్పి
సూరనార్య మహాకవి, సూరివినుత!

---

# భట్టుమూర్తి

—జాషువా

అంతము గానరాని బహుళాద్భుత సత్కవితా ప్రపంచ మా
వంత చలించునో యను భయంబున రాయలు నిల్పు నష్టది
గ్గంతులలోన చెప్పుకొనగా దగు శ్లేష కవిత్వచండ భా
స్వంతుడ నీ వహో! సరస భట్టుకవీ! కవితాకళానిధీ!

దాటవశంబుగాని కవితా నియమోన్నత భిత్తికల్ నిరా
ఘాటజవంబున న్నెగసి గంతులు పెట్టెడు నీదు శ్లేష వా
గ్ధాటికి పెద్దనాదికవిదంతులు తత్తర మందలేదె, యా
నాటికి నేటి కింక నొకనాటికి నీ కెదురేరి సత్కవీ.

"కాపుకవిత్వ మెవ్వరికిఁ గమ్మదనం బగునంచు" నెవ్విఁయో
లోపము లెన్ని నిన్ను సభలో నవమానము సేయు లింగనిన్,
"గోపము సేయకింక నను" కొమ్మని చక్కదనాల కబ్బపుం
గాపులు గాచిపోయితివిగా కవితా దివిజద్రుమంబునన్

*****

# తెనాలి కవి

—రాయప్రోలు సుబ్బారావు

లింగడవో! కృష్ణుడవో! యె
ఱుంగల్ తంటాలు పడెడి ప్రౌఢలతోనే
నంగడి బేరము సలుపక
పొంగెడి నీ హాస్యరసవిభూతిందలతున్

అల్లసాని కులీనునల్లిక జిగిబిగి
“అమవస” చీకటినణగెనంట
ముక్కుతిమ్మనగారి ముగ్ధపల్కులసౌరు
బుడిబుడి “యేడ్పు తో” పొగిలెనంట!
ధూర్జటి మాధురీమాధుర్య మహాత్మ్యంబు
“హా! తెలిసె” న్నాగ నడలెనంట!
భట్టుమూర్త్యాశ్లేష పదబంధ కృతి భూష
“భూ” యనిన శ్రీతమాయెనంట

నీదు చాటూక్తి గుంభనాన్విత వినోద
గతులు శ్రుతి మీఱునాళ్ళనోకవి వతంస!
ఇది యదాస్థాయి గనిన నయ్యవి యపూర్వ
సముపలాలిత చిరవిలసనము లంట

మా తెలుగునాడు కమ్మకమ్మనిది-యిచ్చ
కాల నుడికారములకు బేర్గనిన దన్న!
ఎన్ని పొట్టలు విచ్చిపోయినవో! నోరు
విచ్చినవ్వక, నీవు నవ్వించునాడు

నీ పిలక జుట్టు గాలిలో నిలచి అతిహా
సిత ముఖరుడైన జలధర శేఖరునకు
బాష్పములు రాలిపించెనో! భళిర! నీదు
హాస్యరస పూర్వమోనాడు నలుగుపాలు.

"వికటకవి" వయియెట్లు త్రిప్పినను జెల్లి
యున్న నిను వీధిలో గాంచి యొదుగుచుండు
దమ్ముదామె నమ్మని పెద్దతలలు గూడ
బుడుతలుందురు డాగురు మూతలాడ

ఏదో సింహనాదమ్మన లేపు దక్కి
దిగ్గజమ్ములు మూలల గ్రమ్గుచుంది
గాలుపడ విప్పు నీ "తిలకాష్ఠమహిష
బంధనమ్మ"న కొక నమోవాకమయ్య!
ఏమి సరసాలురా! యిత్తువేరసాల
ఫలములటు పచ్చివాతలు బ్రాహ్మణులకు
ఏమి యెత్తి పొడుపులురా! యెంతవాని
పొత్తమునుగాని "చేపలబుట్ట" యనెదు
నీకాసేతు హిమాచలమ్మ నెదురున్నె? అగ్రశాఖాపిక
మ్మా! కాణాలు పఠించు మేము నిను నమ్మలేముకాబోలు! వా
చా కౌశల్య సమృద్ధి వ్యక్తిగత దోష ప్రక్రియాఖండనై
కాకూ తమ్మననే వెలార్చితి కదో! స్నిగ్ధహాస్యప్రియా!
ఎవరో "నీవొక హాస్యగాడ" వనినారే? వీధిలో నాట కౌ
లువు నా సార్థక తావలేన శితచర్యల్ కావురాతండ్రి మా
భవితవ్యమ్మును తీర్చిదిద్దిన మహాభాగుండ వానాటి వి
ప్లవ నృత్యమ్ములు కొన్ని మాటుమణగిత్వద్భూమికాక్రీడల
కొందరు తోడి పెండ్లికొడుకుల్ భవదీయ వినోదసాహితీ
వందితులై దృఢానుకరణ ప్రతిభ నినువంటి వారలై

యుందుకో! నాడు మేమొకటికొక్కటి చేర్చియభానొనర్చి
చుందనపుం గాతల్ సుకవిసోముడ పుక్కిట బట్టినామురా!

తత్త్వనిధిలి! చతుష్కావ్యదారలందు
ఘనుడ! వెటునీటి కన్నులు జుల్కానగజాతు
నీ చరిత్రము? పోకిరి నిగమశర్మ
చరితలో నతిగంభీర సరసి దాల్ప

చతుర వచన విలాస లాస్య ప్రవీణ
యైన ప్రౌఢాంగనం బోలునట్టి "పాండు
రంగ" కృతి యన్యకావ్య ముగ్ధాంగనా వ్ర
జమ్ము నదరించి, బెదరించి చాయదోచు

వేములవాడ శ్రీ భీమకవీంద్రుండు
గంగ్రాజుపైని శంఖమ్మునూదె
శ్రీనాథకవిరాజు చెలగి డిండిముపైని
గేకిసల్ గొట్ట మ్రోగించె భేరి
నీవు గర్వోన్మత్త నృపపండితుల మర్మ
ములను భేదింపగా మొనసినావు
తిరుపతి వేంకటేశ్వరులు నానారాజ
సభలలో గుస్తీలు గులిపినారు

అబ్బ! కవి యోధులార! యంతవారు
మిరె; సాహితీ విజయవిహారలీల
కీ తెలుగు రాణి కడుపుననే జనింప
రారె! యెన్నో జన్మము లెత్తు వ్రాతయున్న.

---

# మొల్ల

—ఆదిలక్ష్మి

శ్రీమహితంబు భక్తజన
చిత్త వశీకరణంబు నైన శ్రీ
రాముని సత్కథా మృతము
రమ్యతరంబగు నాంధ్ర కావ్య చిం
తామణి పాత్రనించి కవి
తా చరితార్థతఁ గాంచినట్టి నీ
నామమె సర్వకాలము మ
నంబున నిల్పెద మొల్లమాంబికా!

మనమిరువుర మొకయూరనె
జననంబౌ కతనఁ గవన చందన లతవౌ
నినుజేరియుంట నీ యీ
చినచెలియకుఁ గావ్య రుచులు చివురించె నిటుల్!

ఆంధ్ర మహిళలఁదొలుత కావ్యము రచించి
అక్కవైతివి నీవు, తిమ్మక్క నేడు
తాన పెద్దక్కయై యిష్ట తరలి వచ్చె
ఇరువు రక్కలుఁగలుగ మాకేమి లోటు!

కమ్మని తేటతెన్గు నుడి
కారముతో సరసార్థ యుక్తితో
ముమ్మరమైన నీ కవన
ముం జవిచూచియు కొందఱయ్యలే

కుమ్మరి మొల్లయంచు నినుఁ
గూర్చి వచించిరి; తెన్గునాఁట నీ
కు మ్మరి లే దదేల కుల
గోత్ర విచారము కావ్యచర్చలో?

కందువ మాటలన్ రచన
కందువుగా నొసగూర్చి సామెతల్
పొందుగ నించి, తెల్గు పొలు
పొందెడు పూర్వుల కావ్యరీతులం
దందముఁగాగ సత్కవిత
లల్లిన నీకృతి దివ్యమూర్తి చే
విందుల బెట్టి దివ్యపద
విందుల నందుల నందినావు పో!

ధరియించితివొ లేదొ తమి మల్లెమొల్లలు,
నీవాక్కు మల్లె పూతావి నించు;
తురిమితో లేదొ జాదులనైన, నీకైత
జాజుల పొట్లంబు నోజ దెలుపు;
పూసితో లేదొ కర్పూర గంధంబు, నీ
కావ్యంబు దివ్య సుగంధ, మీను;
అనుభవించితొ లేదొ యైహిక సౌఖ్యంబు,
నీకృతి సద్భక్తి నియతిఁజూపు;

గోప వరమునందు గోపతియైన మ
ల్లీశు కృప గవిత్వ లీల నెఱపి
రామకథ నొసంగ రంగంబు వీడితి
వింతె, నీదు కథయు వింతె యయ్యె.

కేసన నీదు తండ్రి పరి
కింపఁగ జంగమ లింగ పాద సే
వా సమచిత్తవృత్తి శివ
భక్తుఁడు, నీవు విశేష వృత్తి మై
వాసవ భక్తురాలవు, శు
భం కృతికూర్చితి రామ సత్కృతిన్,
ఈ సమయాన నిన్ను గణి
యించెద కేశవ శైవమూర్తిగా.

ఉల్లమందు భావ కల్లోలమును గట్టి
యిల్లు వెడలకుండ నేకతముగ
నల్లునట్టి కైతలెల్ల దేశంబున
మెల్లమెల్ల తావివెల్లి నించె

శ్రీ కల్యాణ గుణావహంబుగ జగ
జ్జే గీయ మానంబుగా
నా కాలంబున దక్షిణాపథము క
న్యా తీర్థ పర్యంతము
న్నేకచ్ఛత్రముగాక కీర్తిలహరీ
హేవాకుఁడై యేలు నా
క్ష్మా కాంతాగ్రణి కృష్ణరాయ లెఱుగం
గా వీచె దద్వానవల్.

"రాజ రాజాధి రాజ వీర ప్రతాప
సాహితీ సమరాంగణ సార్వభౌమ
కృష్ణ రాయేంద్ర!" యనుచుఁ గీర్తింతు రతని
వంధి మాగధులును కవివర్యు లెపుడు.

భువన విజయాంక చిహ్నమౌ భవనమందు
అష్టదిగ్గజ కవి నమ స్యర్చితుఁడయి
కృష్ణ రాణ్మణి యొకనాఁడు కొలువు దీర్చి
సరస సద్గోష్ఠినుండి యీ సరణి బల్కె!

మా పూర్వులలో సంగమ
భూపాలక కంపరాయ భూపతి సతి వి
ద్యోపేత గంగమాంబిక
దీపిత 'మధురా విజయ' కృతిని విరచించెన్.

కాని యది సంస్కృతైక భాషా నిబద్ధ
మై యెసెంగెడు, మధుర మౌనాంధ్ర మందు
పుట్టుతోడనె కవయిత్రి యట్టి మొల్ల !
ఆమె కవన విశేషంబు నద్భుతమట !!

పంపియుంటి గోపవరము నేఁడుదయాన
ముద్దు తనయ యైన మోహనాంగి,
తోడఁ దోడ నామె దోడ్కొని తేరంగ,
ఇంత వఱకు రాని హేతు వేమొ?

మోహనాంగి కూడ ముద్దు ముద్దుగ కైత
దిద్ద నేర్చి నట్టి ధీరమతియ,
క్రమ భావలైన కవయిత్రు లిర్వురు
కూడియున్న కాలమేడఁ దెలియు!

అనుచు నుండ ప్రతీహారి యరుగుదెంచి
"మొల్లమాదేవి వారును మోహనాంగి
వచ్చియున్నారు దేవ! యివ్వార్త దెలుప
గోరుచున్నా" రనుచు బల్కె, గౌరవమున

కొలువు నాటికి చాలించి కృష్ణరాయ
లపుడు చాటంగఁ బనిచె విద్యానగరిని
మొల్ల కవయిత్రి యాస్థానమునను నెఱవు
ఆశుకవితా ప్రదర్శనోద్య ద్విభూతి.

శ్రీ నలినాక్షి భారతియుఁ
జెల్వుగ నే మహనీయు సత్సభా
స్థానమునం బరస్పరము
సౌహృదలీల వసించి రా మహీ
జాని స దక్షిణాంధ్ర సువి
శాల మహాపథ చక్రవర్తివి
ద్యానిధి కృష్ణరాయలు ము
దంబున కొల్వును దీర్చు నంతలో-

అలరె తూరుపు గద్దెయందు పెద్దన, పడ
మటి గద్దె నందితిమ్మనయు నుండె;
ఒప్పె మా మల్లన యుత్తరపుం గద్దె,
ధూర్జటి దక్షిణస్థుఁడుగ వెలిఁగె
ఈశాన్య దిక్కున నెసఁగె రుద్రయ కవి,
ఆగ్నేయ రామభద్రాఖ్యుఁ డలరె;
వాయవ్య దిక్కు సింహాసనంబునను రా
దా మాధవ కవియుఁ దనరె; నిరుతి

దిక్కునను హాస్య రచనంపు దిట్ట రామ
లింగ సుకవీంద్రుఁ డుజ్వలలీల నొప్పె,
అష్ట దిక్కుల యందు సింహాసనముల
నధివసించిరి కవి కుంజరాళి యట్లు.

**31**

‘ప్రౌఢతనము మీఱ పురుషులు చెప్పిన
కవిత మించునట్టి కవన గరిమ
కలుఁగు వెలఁది’ యయ్యుఁ గనబోదు పురుషుల
నదియ ఆమె వ్రతము ననుపమంబు.



# వీరేశలింగ కవి

—శ్రీమతి కొటికెలపూడి సీతమ్మ

"ఒక యెడ స్త్రీ పునరుద్వాహాము గూర్చి
వాదించుఁ బండిత వీరులతోడ
సరగ నింకొక దెస సంఘ సంస్కరణచే
జెలగు సభనుపన్యసించుచుండు
బఱగ వేఱొకదెస బత్రికా ప్రకటన
భారంబు వహించు ప్రజ్ఞమీర
రహినొక్కెడ తఱి గ్రంథరచనా విశేషంబు
నను దెల్పు జనుల దుర్నయము లెల్ల
నొక నిమిమిషమైన విశ్రాంతి నొందకుండ
బరహితార్థంబు కొరకునై పాటుపడుచుఁ
గాలమెంతయో విలువఁగా గడుపునహహ
ఘనుడు వీరేశలింగాఖ్య కవివరుండు



# 'కవిరాజు' త్రిపురనేని రామస్వామిచౌదరి

—గులాం యాసీన్

సకల దిశలన్ సత్యకాంతుల
　　శాసనంబిడిలేచియాడెను;
ఘడియవచ్చెను ఘనత జాటగ
　　గడియపడె నవమార్గయాత్రకు.

విప్లవమ్మును లేవదీసిన
　　వీరుడవు కవిరాజశేఖర!
తోటితమ్ముల భుజము తట్టి
　　బాటచూపిన భవ్యతేజుఁడ!

అరువు తెలివియె మిగిలి జ్ఞానము
　　కరువయిన చెడు సంఘమందున
కొదవలేని సత్యసంపద
　　కొల్ల కొల్లగ పంచినాడవు!

ఆభిజాత్యపుటహాంకారము
　　నమాంతముగ నణగద్రొక్కి
మౌఢ్యజాడ్యము విచ్చిపారెడి
　　మందులిచ్చిన రాచవైద్యుడ!

రంకు గొంకుల బొంకు వాదుల
　　పాతరల పెకలించినాడవు
నీతిధర్మము, సద్వివేచన
　　హేతువాదము నలిపినాడవు!

నీవె కవివి! నీవె రవివి!
నీవె సత్యాత్ముడవు, త్యాగివి!
భావవిప్లవ భాగ్యదాతవు
దివ్యసూత్రాశ్రమపు యోగివి!

కలుషితపు జ్ఞానంబు ప్రబలి
కాడు కలసిన సంఘమందున
వెలసి జీవన జ్యోతి కాంతుల
వెలుగు జిమ్మిన తెలుగురాజువు!

సమతయే సుమీ! మమతయిలలో
సాగిపొమ్మని నేర్పినాడవు!
మానవత్వపు మహిత కాంతుల
మార్గమందున నిలిచినాడవు!

బుద్ధదేవుని అపరమూర్తిగ
భువిని వెలసిన కర్మయోగివి!
వద్దెసల చైతన్య భేరి
నాదమును విన్పించినాడవు!

తెలుగువారల ఆత్మలందున
వెలుగుచుందువు ఎల్లవేళల
నీదు జీవిత కథలు పాడెడి
నాడుకాలము రాకమానదు!

అభిరుచుల నవకాశములకున్
అడ్డు తగిలిన అహంభావుల
స్వార్ధవాదుల వెల్లతరిమిన
స్వామి! నీదె ధన్యచరిత!

35

మరువరానిది నీ చరిత్రము
        మానవాళికి తరతరాలుగ
దుష్ట సంఘాచార ఘోరము
        భ్రష్టమై ఇల తొలగిపోవగ
మరువరానిది నీ చరిత్రము.

ఓ రాజకవి! ఓ జ్ఞాన భాస్కర!
        రత్నకాంతుల విరాజించిన
నీ మహోజ్జ్వల సుప్రబోధము
        నిఖిల జగతికి నవనౌన్వేషము.



# గురజాడ

—తిరుమల శ్రీనివాసాచార్యులు

అభ్యుదయ సాహితీ నేతా!
నీకిదే మా జోత.
తెనుగు కవితా కన్నియ చెక్కుటద్దాలపై
నీవద్దినావు జవ్వాది పూత....

సంఘాన్ని సంస్కరించాలనీ,
సమతనూ మమతనూ
సమపాళ్ళ రంగరించాలనీ,
నీవు చేసిన గానం
ఆంధ్ర జాతి హృదంతరాళాన సజీవం ...

సాధ్యంకాదు కవిత్వం అందరికీ
పండితులయినంత మాత్రాన
కవులు కారెన్నటికీ....

హృదయంలోంచి జనించి
హృదయాలను కదిలించేది కవిత....
ఇది నీవు దిద్దించిన ఒరవడి.
నిరర్థకం కాదు నీ నుడి.

ప్రజావాక్కే పలుకుతున్నావు.
ప్రజల కోసం బ్రతుకుతున్నావు.
అందుకే అందుకో
నీ పూర్ణమ్మకు మా నీరాజనం

**37**

**నీ కన్నెక నిత్య నూతనం.**
**నీ ముత్యాల సరాల రవం**
**మాకు రస నిర్దేశం....**

నీవు మొదలు పెట్టింది మహాయజ్ఞం
అందుకు సమిధలు మేమూ వేస్తున్నాం.
'ఆకులందున అణిగిమణిగీ కవిత కోయిల పలుకుతోంది.'
ప్రజావేదన ప్రజలకోసం
కవుల కలమున ఒలుకుతుంది.

సాహితీ సమరాంగణాన
సామాన్యునికి ప్రాముఖ్యం....
తెనుగు కవితా ఝరిలో
విచ్చుకున్న అరుణ కమలం....



# చెళ్ళపిళ్ళ మహాకవి

—రాయప్రోలు సుబ్బారావు

గుణవత్సలమతి కమృత ర
మణీయ కవితారసాల మధుమత్కృతికిన్
ప్రణత కుమారాంధ్ర కవి
ప్రణతులు శ్రీ వేంకటేశ్వర బృహస్పతికిన్

ఉభయ సుధీపరిషత్ ప
ట్టభద్రుడయి వెలయు వేంకట కవీంద్రగురు
ప్రభుపాదున కివె మావా
గభినవ కాదంబినీ పయః పాద్యంబుల్

భవదీయ కావ్య శారద
నవరాత్రవ్రత సమర్చన నిండినదీ
కువలియ కోమల ఖాండ మ
నవద్యము కళా ప్రపూర్ణనై వేద్యముగాన్

# గురుదక్షిణ

—నండూరి రామకృష్ణమాచార్య

సీతల యూపు నీ నడక నీ నుడికారము నీవి యే మహీ
నేతకు గల్గు? తెల్గునకు నీ వలనం గద నేటి వి
ఖ్యాతి; కవీంద్రులన్ మలచినట్టి కవీశ్వర! సాహితీ పరం
జ్యోతివి నీవు పింగళి మహోదయ విశ్వకళా జగద్గురూ!

సాహితీ సమీక్ష-సారస్వత చరిత్ర
క్రాలుచుండును రెండు కన్నులగుచు
ఎవ్వడే రెనార్థి-ఏ కాంత వీరుడై
అతడు—లక్ష్మికాంతు డనగ బరగె.

ఆంధ్రభారతమ్ము-యాపత్ కృతులయందు
భావదీప్తి యందు—భాష యందు
నిరుపమాన కీర్తి నిర్మించుకో గల్గె
కవుల యందు లక్ష్మికాంతు డటులె.

పింగళి లక్ష్మికాంతుడు-నవీన సనాతన సాహితీ కళా
సంగమ రంగ బిందువు—రసైక సమన్వయ శిల్ప సాధనో
త్సంగ తపస్వి-విశ్వకవితా హిమవన్నగ తుంగ శృంగు డా
జంగమ సాహితీ చరిత-స్వాదు విమర్శక సార్వభౌముడున్!

దీపము పెక్కు దీపముల తేజముతో వెలిగించు రీతి-నీ
ప్రాపున చేరు శిష్యులకు వాఙ్మయ దీప్తిని గూర్చినావు-శో
భాపరివేష దీధితులు భావితరంబుల లోన చిమ్ముచున్
నీ పలుకుల్ సదా తెలుగు నేల ధ్వనించుత నాల్గు దిక్కులన్.

# కాటూరి

—మల్లంపల్లి శరభయ్య

"ఆరంబోసిన పండు వెన్నెలలు నీహారంబువుల్ మేల్మి బం
గారమ్ముల్ దొవజేకు మెత్తనలు ముక్తాహారముల్ సాంద్ర క
ర్పూర క్షోదము గర్భకైతక దళమ్ముల్ కార్తికీశాలి కే
దార శ్రేణులు రూపుగొన్న కవితా తన్వంగికిన్ భద్రమే"



# శ్రీ విశ్వనాథ

—కరుణశ్రీ

నిద్రాణమ్మగు జాతికిఁ నవనవోన్మేషమ్ము చేకూర్చిని
ద్రస్ఫూర్తి పథప్రవర్తియయి నర్తించెన్ భవన్మూర్తిలో
భద్రంబుల్ భవదీయ భారతికి విద్వన్మండలాధ్యక్ష! శ్రీ
మద్రామాయణకల్పవృక్ష కవిసామ్రాట్, నిత్యసత్యప్రియా!

ఎవరయ్యా ప్రతి-విశ్వనాధులకు-బ్రాహ్మీదత్త సాహిత్య సం
స్తవనీయ ప్రతిభాసనాధులకు-విశ్వస్తుత్య పాండిత్య వై
భవ సంప్రాప్త యశోధినాధులకు-నిర్వ్యాజానురాగంబునన్
కవితాయోగమునన్, ప్రసన్నరసవద్ధారా ప్రయోగంబునన్

నవలల్ గూర్చును, నాటకంబులను విన్నాణంబుగా దీర్చు మేల్
కవితల్ నేర్చు; కథల్ వెలార్చు; సుమహాకావ్యంబులీడేర్చు; నీ
జవసత్వంబులు సర్వతోముఖ మహాసాహిత్య సౌభాగ్యముల్
భవదీయ స్తవనీయ లేఖినికియే బ్రహ్మాయురారోగ్యముల్

విశ్వ "కళాప్రపూర్ణ" డని విశ్వకవిఁ నిను నేడు సాహితీ
విశ్వము విశ్వసించె, మన విశ్వకళాపరిషత్తు లౌనిటుల్
శాశ్వతమైన గౌరవమొసంగె, మహాంధ్రమునందు రాజ రా
జేశ్వరియై భవత్కలిత యేలుత ప్రాజ్ఞిరసిజ్ఞి రాజ్యమున్

చాళుక్య జనపాలు నేలఁగేల్ కీలించి
నన్నయ్య సుప్రసన్నముగఁ జూచె.
తిక్కయజ్వకు ప్రక్కప్రక్కగా నిల్చి శ్రీ
నాథుండు సబహుమానముగా జూచె

కవిసార్వభౌము వెన్కనే నిలంబడి పొంగి
పొంగి పెద్దన తొంగి తొంగి చూచె.

శయ్యజిగిదేఱ-భావాలుజాలువాఱ
చేవనిండాఱ-వైచిత్రి చెలువుమీఱ
అక్షరమ్మక్షరము కల్పవృక్షమగుచు
నీవు రామాయణము వ్రాయునిముసమందు

అరిపో వెన్నాళ్ళకారాజు మునిరాజు
గడ్డాలరాలు "ముక్తాకణాలు"
అలసిపోఁడెన్నేళ్ళకైన పాడుచునాట
లాడు దుందుడుకు "శాంతమ్మ కొడుకు"
ఆగిపోదు శతాబ్దులైన నను పొంగులె
త్తిన మిన్నువాక "గాధేయురాక"
అంతమ్ముగాదు యుగాంతాలకును గౌతా
మాశ్రమమ్మందు "నహల్యవిందు"

చంటి బిడ్డరాముడు మునివంట నొక్క-
కందిపోయిన కౌసల్య కంది గింజ
రంగు మారడం కోటివర్షాలకైన
తాత్త్విక స్ఫూర్తి సత్యచైతన్యమూర్తి

(దేవేంద్రుడు స్వగతం)

తిమ్మన పారిజాతము క్షితిస్థలికిం గొనిపోవుటాది దే
హమ్ము వడంకు 'సత్కవులన్న' తదాఖ్యుడ నేడు కల్పవృక్ష
మ్మును గొంచుబోయి బిగగట్టెను రామునితో మహాప్రబం
ధమ్మదియయ్యె; నింద్రుతల దన్నగ నేడొక సత్కవీంద్రుడా

(నారదనారాయణులు)

ఆ మహిరాజు పాన్పున సుధాంబుధిపై శయనించువారు నా
రాయణ; యెద్దునందిసుకరాల పరుండితిరేమి? సత్యనా
రాయణుడన్ తెలుంగుల మహాకవి కిన్నెరసానిపాటలన్
కాయముపొంగి వేయిపడగల్ కదలన్ మనశేషుదేగెరా!

(ఉమాశంకరులు)

స్వామీ! ఎక్కడినుండి "సత్యకవి మాస్వామీయనన్ బోయినా
నే" "మౌళిన్ శశియేది?" దూతయయిపోయెన్‌వానికేనాడో" తే
దేమీచేత త్రిశూల "మా! మరచిపోతిన్‌వాని నట్టింట" "లే
దేమీ గంగ శిరస్సుపై" కలసిపోయెఁ వాని వాగ్ధోరణిన్

—

# జాషువా ఒక మనీషి

—పేరి రామారావు

భరతమాతను వచ్చి బాలింతరాలుగా
తెలుగుకైతను తీర్చిదిద్దినావు
సుకుమార పదజాలసూక్తి వైచిత్ర్యాల
నలరారు కబ్బాల నల్లినావు
పండితోద్దండవిభ్రాజమాన సభాంగ
ణాల సన్మానాల నందినావు
నవ్య భావావేశ నైపుణ్య గణ్య న
ఖండ కావ్యాలెన్నో గటపినావు.

తెలుగునాడున నీ కీర్తి దిశలు ప్రాక
పండితులను కవులును సెబాసనంగ
సాటివారలు కైసేసి సన్నుతింప
వరలినావయ్య ఓ జాషువా కవీంద్ర !

సురలు జేజేలు కొట్ట భూసురులు మెచ్చ
భూరి కాన్కల నొసగ సత్పురుషులెల్ల
దీవనలొసంగి సాహిత్యదీప్తులెత్త
వసుధలో వెల్గితివి జాషువా మనీషి.

# 'కవిచంద్ర!' తుమ్మల సీతారామమూర్తి

—ఏటుకూరి వెంకటనర్సయ్య

కనకాభిషేక మహిమున్
గని, పెండారమ్ము తొడుగఁగాంచి, గజ
మ్మును నెక్కుటరసి శ్రీనా
థునిఁబెద్దన్నను స్మరించుదుము కవిచంద్రా!

కవిపదము సార్ధకముగా
భువి మంటిని పూర్వజన్మపుణ్యముకతనన్
కవివైతివి నీకు శుభ
మ్మవు గావుత మన్నియెడల సంధ్రకవీంద్రా!

ప్రగతికి సుగతి కనారత
మగుకావ్యము లెస్ససేతు రార్యులు నీవా
తగవెఱిగి రచించెద వా
వగఁ గూర్పనివానికేల వన్నె ఘటిలున్?

నీకవితా సంభావన
కీకానుక లంపినాఁడ పారతుషార
శ్రీకమనీయంబై యశ
మాకల్పమ్మెసక మెసఁగు నంధ్రావనిలో!



# అబ్బూరి వరదరాజేశ్వరరావు

—శ్రీ శ్రీ

నీ వ్రాసిన చెరకాలం
తీవ్రంగా చదువ చదువ తెరలెను వరదా
నీవ్రయ్యలైన హృదయపు
చేవ్రాలే కావ్యమై రసించెను వరదా !

చెరకాలపు చిరదారుణ
మరణారుణ చరమకేక మనకో సరదా
దురితాలతో ద్రవించిన
చిరబాధే కావ్యమై హసించెను వరదా !

అల వైజాగున మన ఆ
టలు మన పాటలు జ్వలించడం అది సరిదా
కలకాలం చెరకాలం
నిలువై తుదికావ్యమై స్పృశించెను వరదా !

శ్రీమాన్ మీ పాదరు నా
కోమాదిరి నాన్నగారె ఒకటే కొరదా
ఏమయితేనేం? ఇరువురి
క్షేమం ఒక కావ్యమై ధ్వనించెను వరదా !

——

# అబ్బూరి వరదరాజేశ్వరరావు

—విశ్వనాథ

కావ్యమునకు కావ్యమె పూ
ర్ణ వ్యాఖ్యానమ్మటండ్రు ప్రాజ్ఞులు, యీ నీ
నవ్యకవితాకృతికి సం
భావ్యము పద్యప్రశంస భద్రము వరదా!



# అబ్బూరి రామకృష్ణారావు

—భద్రిరాజు కృష్ణమూర్తి

ఆంధ్ర విశ్వకళాలయము వానికి విధాత
విజ్ఞాన ఖని పదవీ విముఖుడు
ఆంధ్రాంగ్ల సంస్కృతా లాకళించిన మేటి
భావకవిత్వము పట్టుగొమ్మ
రాజకీయాల సారమెరంగిన విరాగి
ఉత్తమ సంస్కారి యోగిసముడు
బాదరాజుకు నాకు బుద్ధినేర్చిన ఒజ్జ
మృదు వచశ్చతురు డభ్యుదయవాది

అట్టి అబ్బూరి మాష్టారి కిట్టి వ్యాస
సంపుటిని అంకితము చేయు సమయమందు
నాదు దీవన లభినందనమ్ములందు
కొమ్ము; గురురుణంబును తీర్చుకొంటివోయి!



# కృష్ణ ఝరి

—ఇస్మాయిల్

పదాల గులక రాళ్లని
పదిలంగా అరగదీసి
పక్క-పక్కన పొదిగి,
బతుకంతా కరిగి
కలస్వనంతో పాడే
సెలయేరు కృష్ణశాస్త్రి.

పురాతన కావ్యాల
శిలాతల గర్భాల్లో
శీతల గళంలో రవళించిన పాటే
వెచ్చటి కోరికలతో
పచ్చిక బయళ్లెమ్మట
గంతు లేస్తోంది నేడు.

విరహి బాష్ప నక్షత్రాల్ని
ఒరసి పారి మెరుగుదిద్దే
చీకటి సెలయేటి లోని
చిక్కటి విషాదపు జీర
కృష్ణశాస్త్రి ! నీ గళంలో
కలవర పడుతోంది.

నడిరేయి ఏకాంతంలో
కడుపు చించుకుని

50

వెల్లువలై పారే
పిల్లంగోవి గుండె అగాధాలు
కృష్ణశాస్త్రి ! నీ గొంతులో
క్రీనీడలు పరుస్తాయి.

ఇరు చెంపల్ని తాకి
ఒరుసుకుంటూ పారే
ప్రియురాలి కురుల సెలయేరులా
కృష్ణశాస్త్రి! నీ పాట
ప్రపంచపు అందాల్ని
పొదివి పడుతుంది.



# నాయని సుబ్బారావు

—విశ్వనాథ సత్యనారాయణ

ఒత్తు కొనివచ్చు నా కందకుండ మాన
సాతి నేగమ్మ నా గీతి కందకుండ
ఓయి తమ్ముడ నా కందద యుఱక పరువు
లెత్తుచున్నదోయీ నీ యదృష్ట రేఖ !



# శ్రీ వేదుల

—శనగన నరసింహస్వామి

వెన్నెల కాసినట్లు పికబృందము కూసినయట్లు తెమ్మెరల్
సన్నగ సాగినట్లు మమసౌరభముల్ ప్రసరించినట్టులా
వెన్నుని చేతివేణువు రవించిన యట్లనుభూతియోగసం
పన్నతగాంతు వేదుల సువాఙ్మయవాటి చరించు వేళలన్.

అదియొక పుష్పశాలయని యాడుదునో కొనియాడబోదునో
అదియొక పానశాలయని హాయిగ వేదుల నవ్యసాహితీ
పదముఖశాల సీడలను భావుకతాపము లారి తీయగా
బ్రదుకనివారు వాగ్రస పిపాలు తీరనివారు లేరెటన్.

పూర్వకవీంద్రపాండితి అపూర్వమనోహరభావనాకళా
సార్వపథీననైపుణి తుషారపటీరసుధాకరాచ్ఛతా
దూర్వహసూక్తి సంతతియు తోచెడి వేదుల కావ్యశిల్పమాం
ధ్రోర్వికి భాగధేయమని యూహపొనర్తురు భావుకాగ్రణుల్.

వాగర్థంబుల కద్భుతప్రణయదాంపత్యంబు సంధించి క
ల్పాగప్రౌఢసుమార్దవ్రమైన నవశయ్యాసీమ కల్పించి హే
లాగాంభీర్య చమత్కృతి ప్రచురసల్లాపైకలీలాకళా
భోగాభోగము సంఘటించు సుకవీట్యన్ మెచ్చెదన్ వేదులన్.

స్వాదుకవిత్వతత్వ రససాగర పారగులైన సత్కవుల్
మేదిని నెందరెందరొ క్రమించిరి మించిరి కీర్తి గాంచి ర
య్యాది యుగంబుదొట్టి బహుశాంధ్ర కవీశ్వరమండలంబునన్
వేదులయన్న నాయెదద వేయి వసంతము లావహించెడిన్.

# ఓ ! మహాకవీ !

—జి.వి. సుబ్బారావు

ఓ మహాకవీ ! ఓ ! శ్రీశ్రీ !!
ఛందస్సుల శృంఖలాలు త్రెంచి,
ఛాందస భావాలకు స్వస్తి చెప్పి,
శబ్దాశ్వహృదయ మెఱింగిన మహాశ్వికుడులా,
శబ్దంపై నిరంకుశాధికారం చెలాయించి,
ప్రతిభా వ్యుత్పత్తుల వల్గన ప్లుతులతో
పదునైన కదం త్రొక్కుతూ
కవితా హృదయం వెల్లివిరిసే
శబ్దార్థ సమన్వయ గమనంతో
విజృంభించావు ఆంధ్ర సాహితీపథంలో !

ఓ ! మహాకవీ !
నీ నాదం సామ్యవాదంగా
నీ గీతం విప్లవ సంగీతంగా
నీ కవితావేశం నవయువకావేశంగా !
ప్రళయగర్జన చేశావు విప్లవ సింహంలా-
ఛాందస కవిత్వం ఏనుగుపిల్లలా వణికేలా,
భీకరా రావం వినిపించావు క్రుద్ధవ్యాఘ్రంలా-
తెనుగుకవిత లేడిపిల్లలా

జనతా కవితారామంలో చెంగున గెంతేలా,
ఘీంకరించావు మదమత్తేభంలా-
యువగళాలు సంకెళ్ళు త్రెంచుకొని

శంఖారావం పూరించేలా !
మహాప్రస్థానంలోంచి, మరోప్రస్థానం వరకు,
ఖడ్గసృష్టి నుండి వదునైన ఖడ్గవృష్టి వరకు,
యాభై రెండు నుంచి శోభాయమానమైన
స్వాతంత్ర్య వీరగీతాలకి
సినీ కవితా గేయాలకి
వచన కవితల మాగాణం నుంచి,
రేడియో నాటికల పంటతోటల వరకు
అవిచ్ఛిన్నంగా, అనర్గళంగా, అనన్యంగా
అనితరసాధ్యంగా సాగింది
నీ కవితా విప్లవ వ్యవసాయం !
వ్యాపించింది దిగంతాలు, అనంతాలు
దేశాలు విదేశాలు, భాషలూ పరభాషలూ
నీ విప్లవ కవితా శంఖారావం !
మ్రోగింది తెలుగునాట
వెలుగు బాటగా, ఎర్ర బావుటాగా
నీ విప్లవ కవితాభేరి !
సరసంగా, 'అరసం'గా తుదకు 'విరసం'గా
విరబూచింది, అరుణారుణ ప్రభలతో
ఈ తెలుగునాట, నీ తలపుతోట!
నిత్య విప్లవ భావ సంకేత కేతనంగా !
ఏదీ?— ఆ శంఖారావం నేడు !
ఏదీ?—ఆ సింహగర్జన నేడు !
ఏదీ?- ఆ విప్లవ మహోద్యమ వ్యాఘ్రారావం నేడు!

లేదు ! - లేదు! - లేదు!
మూగబోయింది భౌతికంగా

ఆ గొంతుక, ఆ హుంకారం, ఆ శంఖారావం
నిన్న! - మట్టిలో కలిసిపోయింది !! -
కానీ.
అదే తీగసాగింది విప్లవ కవితా|స్రవంతియై
అది భౌతికంగా, అనంతంగా, అనుహ్యంగా
నేడు ! గాలిలో తేలిపోతుంది !!
వెలుగుతోంది
ఆ, కలం బలం
నిత్య తేజస్సుగా, విప్లవ రోచిస్సుగా
కలకాలం తెలుగునాట !
కవితా గగనపథంలో
మెఋపు తీవలా,
ఉఋము హోరులా,
|ప్రళయ |ప్రభంజనంలా,
యువకావేశంతో
నవతా, సమతా పథంలో
తరతరాల విప్లవానికి వారసురాలైన
తీ|వ్ర విపంచీరావంలా
సాగిపోతుంది-ఆ కవితా తపస్సు !
అదే - మాకు
|ప్రొద్దుగుంకని విప్లవోషస్సు !!!
ఓ ! శ్రీశ్రీ !
ఓ ! మహాకవీ !



# బోయి భీమన్న

నిడదవోలు వెంకటరావు

ఒక్క శబ్దమె దీపమై పెక్కుగతుల
హృదయ కుహరంబు నది వెలిగించు ననిన
దీపసభ యాంధ్రలోక హృద్దీపకమయి
వెలుఁగఁ జేయదె వాఙ్మయ విశ్వజగతి.

దీపసభ చేత కవితా
శ్రీ పరిణితిఁజెంది కావ్య సిద్ధుండయ్యెన్
ఈ పయిని సాత్మ విద్యా
శ్రీ పరిణితిఁ జెంది యాత్మ సిద్ధుండగుతన్.

ప్రథిత కవిత్వ తత్త్వరస బంధురభావ భవాభి రామలై
యధికృతమైన జ్ఞాన కళికా కృతులా భవదీయ సత్కృతుల్
మధురతరాంధ్ర భారతికి మంగళ గీతికలై సముల్లస
న్మధుర తరాంధ్ర విశ్వమయ మంగళ దీపికలై వెలుంగుతన్.

చిల్లీలామృత సాహితీ మధురస శ్రీమించు భీమన్న వా
గ్వల్లీ సంజనితంబు కావ్య కుసుమాంకం బంకితం బండితో
కల్లారన్వయ సుబ్బారాయమణి! యాకల్పంబుగా త్వద్యశో
వల్లీ సంజనిత ప్రసూనములు సంవాసించు నాంధ్రావనిన్.



# "కరుణశ్రీ"

— తుమ్మల సీతారామమూర్తి

యతులు, గణాలు, ప్రాసములు నాద్యులు తీర్చిన బాసకట్టడల్
జతపడఁగై నరుల్ కృతులు సల్పిన యంతన మెప్పు గందురా?
శ్రుతులకు నాత్మ కింపులగు సొంపులు నింపిననాఁడె వారుధ
న్యతను గడింతు; రీ మెఱుఁగు లబ్బిన పాపయ్య శాస్త్రి కంజలుల్"

*　　　*　　　*

"పలికినదెల్ల పద్యమగు; వ్రాసినదెల్ల కవిత్వమౌను; మీ
గళమున గాని మీ జిలుగు గంటము నందున గాని యేవియో
తెలియని క్రొత్తపోకడలు తీవెలు సాగును సత్కవీంద్ర! వె
న్నెల తఱి తీపులో! పడతి నిద్దపు వాతెఱ తేనెసోనలో!!

ఎస్. రాజన్నకవి



# పుట్టపర్తి 'మహాప్రస్థానం'

—రాధేయ

ఆంధ్ర సారస్వతా వైభవ దర్పణం
ముక్కచెక్కలై పోయింది
నిరంతర, అవిశ్రాంత
సాహిత్య అధ్యయన వేదిక
కుప్పకూలిపోయింది.
బహుభాషా సాహిత్య నందనంలో
పండించుకున్న ఆరు దశాబ్దాల వసంతం
వాడిపోయింది.
సరస్వతీ పుత్రుని
'శివతాండవం' చరమాంక
దృశ్యానికి తెరపడింది.
రాయలసీమ ఏకైక
సాహిత్యరత్నం
సరస్వతీదేవి కంఠాభరణంలో
ఒదిగిపోయి సేదదీర్చుకుంది.
ఓ సాహితీ భీష్ముడు
తన సుదీర్ఘ నిద్రలో
శివైక్యం చెందారు.
సంగీత, సాహిత్య కళాసరస్వతి
అంతిమశ్వాస
భావితరాలకు 'అక్షయపాత్ర'గా
మిగిలిపోయింది.

ఒక వాల్మీకి
ఒక తులసీదాస్
ఒక మిల్టన్‌ల
త్రివేణీ సంగమ ప్రతీకగా
కవితా జగతికే పతాకగా
ఓ ప్రబంధ పరమేశ్వరుని
అక్షరతూణీరం
'మహాప్రస్థానం' చేరుకుంది.
ఆచార్యులవారి
అపురూప కావ్యాలు
భారతీయ సాహిత్య ప్రగతికి
అక్షర భాండాగారాలు
సరస్వతీ పుత్రుని
అక్షర లక్ష్మిని
'సేఫ్టీ లాకర్స్'లో
భద్రపర్చుకోవడమే
మన తక్షణ కర్తవ్యం.
ఓ మహర్షీ, ఓ మహాత్మా
నీకివే నా జోహార్లు!



# గురుదక్షిణ

(నండూరి రామకృష్ణమాచార్యులు)

—శనగన నరసింహస్వామి

ఘననండూర్యన్వయఖని
మణి వేంకటరామకృష్ణమాచార్యు యశో
ధని తారాతోరణకృతి
వినిబంధనచణుని గొల్తు విద్యాగురువున్.

హృదయమమృతసముద్రము వదనము కవి
తాలతాంగికి నర్తనశాల సదన
మతిథికోటికి నాటి ఋష్యాశ్రమమ్ము
సరిసమానము మాగురుస్వామికెవరు?

ఎవ్వాని నామంబు హృదితళుక్కుమనినంత
కందోయి మోదవాఃకణములురలు-
ఎవ్వాని విగ్రహంబెదుట నిల్చినయంత
నిలువెల్ల నీపమై పులకరించు-
ఎవ్వాని చిఱునవ్వు నీక్షించినంతనే
చింతాపయోదాళి చెదరిపోవు-
ఎవ్వాని వాగ్రసంబెసగ గ్రోలినయంత
విమలామృతంబును వెగటుగొలుపు-

ఎవని శిష్యానురాగమ్ము నెంచినంత
మాతృపితరుల కూర్మియు మఱపుదగులు
కొల్తు గురుదేవు నండూరికులసుధాబ్ధి
శారదేందుని కృష్ణమాచార్యసుకవి.

అమ్మ విధాన మమ్ము మధురాదరవై ఖరి జూచు మాసుభ
ద్రమ్మను సంతతాతిథిసమర్చన కాశిక అన్నపూర్ణనే
పొమ్మన జాలు సాధ్విని ప్రభూతపుభక్తి నమస్కరింతు డెం
దమ్మున దేశికాంగనను నండూరి వంశవధూజనోత్తమన్.

భోజమహీమహేంద్రు ముఖమున్ గని మున్ జడుడున్ కవిత్వవి
భ్రాజితుడయ్యెనంచు వినుపల్కులు నిక్కములయ్యె మీ ముఖాం
భోజము జూచినంత నెదపొంగెను కమ్మనికైత యీదృశ
వ్యాజము కాక నేను కవినౌటకు వేఱొక హేతువున్నదే.

సాధించినాడ మీ చరణసన్నిధిలోన
అచ్చమౌ కవితారహస్యములను-
గ్రహియించినాడ మీ రమ్యోహనములోన
నవనవోన్మేషవిన్యాసములను-
దర్శించినాడ మీ తతబోధనలలోన
ఆంధ్రవాఙ్మయవార్ధి ఆవలియొడ్డు-
ఆర్జించినాడ మీ అమృతవాక్కులలోన
ఆనతీరగ నుపన్యాసకళను-

కొద్దియో గొప్పయో కవికోటిలెక్క
కెక్కినాడను మీదయారుక్కు కలిమి
చాలు ఈ జన్మకిది ఛాత్రజనసహస్ర
సేవితపదాంబురుహ! కవిదేవ! చాలు.

పాయక మీ పదాబ్జముల పాంసువులన్ తలదాల్చుకొంచు నే
హాయిగ తొల్లి భీమవరమందు పఠించిన నాలుగేండ్లు నా
కాయము నాటుకొన్న పులకంబులు మాటికి సాటిలేని పా
థేయము లౌచు నా బ్రదుకుదీర్చెడి నేడును దేశికాగ్రణీ!

దేహియటంచు నేనొరుల దీనత వేడను రాజకీయదుర్
వ్యూహములేనెఱుంగ కవితోక్తులె రాజ్యముగా దలంచు వ్యా
మోహపువాడ నిప్పటికి భుక్తికి లోపములేదిదెల్ల న
వ్యాహతమైన మీ కరుణకచ్చపుసాకిరి సూ ధరామరా !

నడచెడు నప్పుడు పంక్తిన్
కుడిచెడు నప్పుడును కైత గొడవలు తక్కన్
తడవవు పరవిషయము నీ
యొడలెల్లన్ గైత దేశికోత్తంసమణీ !

ఆకలి నెరుఁగవు శిష్యుల
అకలినే లెక్క సేయవనునిమిషంబున్
శ్రీకవితాగోష్టియె నీ
యేకైకతపంబు దేశికేంద్ర ! కవీంద్రా !

ఎట్టి తపంబు సల్పితినొ యెట్టి వ్రతంబు ఘటించినానొ తొ
ల్పుట్టువునందు నేను గురుపుంగవ ! యీ భవమందు సత్కవీట్
పట్టము గట్టుకొన్న నినువంటి మహాత్ముని పాదపద్మముల్
పట్టుటకబ్బె—ఈ పరముపై కొనుగావుత భావిజన్మలన్ !

దేవుడు దయ్యమంచు గురుదేవుడు శిష్యుడటంచు నార్ద్రిమా
భావములస్తమించు తతపాపదినమ్ములలో భవాదృశుల్
కేవలశిష్యవత్సలత కీల్కొను దేశికులబ్బుటన్న అం
తేవసదాళి భాగ్యము సుధీజనసన్నుత ! శిష్యవత్సలా!

నటులో పాటకులో కవిత్వపటులో నాట్యజ్ఞులో సాహితీ
నటులో శిష్యులొ విందులై బహుకళాపారమ్యలీలానము
త్కటగోష్ఠిగతి వెళ్లబుత్తురెపుడున్ కాలమ్ము నీ యింట నీ
వెటనుందో యట శారదాచరణమంజీరైకశింజాగతుల్.

భావములుల్లసిల్లగను పాఠము చెప్పగవచ్చు సాహితీ
సేవలు చేయవచ్చు నుతిచెందగవచ్చునుగాక చెల్లరే !
నీవలె శిష్యచిత్తములు నిచ్చలు చక్కగ నిల్పవచ్చునే
దేవునిసాటి ఎట్టి గురుదేవునకైనను భూసురాగ్రణీ !

జవ్వనంబున యందె సాటివారౌనన
ప్రాచ్యభాషాధ్యక్షపదవి గనవా-
వేవేల శిష్యుల వీనులుపులకింప
క్రొంగ్రొత్తతెనుగును గుప్పలేదా-
బహుకళాశాలలు భక్తిమై వరియింప
కులపతిగద్దెపై కుదురు కొనవా-
తిక్కన్నభారత దివ్యతత్త్వము త్రచ్చి
శోధకపట్టంబు చూరగొనవా-

సరసకృతులను పెక్కింటి జులుపలేదా
ప్రగతి గీతలు గొంతెత్తి పాడుకొనవా
స్వామి ! గురుదేవ! తక్కువయేమి నీకు
ధన్యధన్యంబు భవలుపాధ్యాయభవము !

సవినయమూర్తులై కవులు ఛాత్రులు వెంబడినేగుదేరగా
నివురులు గప్పునిప్పున తృణీకృత బ్రహ్మపురందరుండవై
నవనవమైన తీవిని చనంగని పౌరులు పెద్దనాది స
త్కవులు తలంపులన్ నిలువగా పులకించుటనే నేరుంగుదున్.

మతిమంతులగు సహస్రవతుల మెచ్చుటెకాని
భావంబులో నీసుపడుటలేదు-
కష్టించి సంస్కృతి గడుపుటయేగాని
పరులసొమ్మున కాసపడుటలేదు-

పేద విద్యార్థుల పిలిచి యిచ్చుటెకాని
మనకేలయని ఊరకొనుటలేదు-
కవిత కమ్మనిదైన గౌరవించుటెకాని
పనికట్టుకొని గేలికొనుటలేదు-

సర్వశాస్త్రముల్ బోధింప జాలియుండి
వలచి వలిపించుకొన్న కేవలపుదెలుగు
పదవి కిసుమంతయును కించపడుటలేదు
సత్యమౌ కాదె భవదాభిజాత్యలక్ష్మి-

తతభక్తిశీలుండు తండ్రివీరాస్వామి
రహిపుట్టజెప్పిన రామకథలు-
రమణీయమైన అర్థము వెంట, పులకించు
అమ్మ సుబ్బమ్మ రసార్ద్రి మనసు-
పెదతండ్రి నరసయ్య హృదయంబునందొల్ల
అవతరించిన కవిత్వాంశదీప్తి-
స్వగ్రామవాసుల సంగతించొంగిన
కవితాదిబహుకళాగాఢరక్తి-

అన్నిటిని మించి జన్మజన్మాంతరాల
నా వొనర్చిన సుకృతమ్మునకు ఫలంబు
గా లభించిన గురుపాదకమలసేవ
తీర్చె నన్నొక కవిగ ఈ తెనుగునాట.

సాగుచున్నదె నిత్యసాహితీసత్రమ్ము
కమ్మగా ప్రత్యనాయమ్ము లేక-
వచ్చుచున్నారె మీ వసదాంగణమునకు
దినదినమ్మును కళాతిథులు నేడు-

రచియింతురే మీరు రమణీయవాగ్రీతి
క్రొంగ్రొత్త కృతులను కొనరికొసరి
మతినెంతురే మమ్ము సుతనిర్విశేషుల
అనుగు శిష్యులనెల్ల నప్పుడపుడు-

అరువదేడుల మహము నేడనుఘటించి
కరుణచూపిన వేల్పు వెంకన్నసామి
సంఘటించుత మీకు ద్విషష్టిపూర్తి
పర్వమును పుత్రపౌత్ర ప్రపౌత్రులుబ్బ!

ఎక్కడో మూల పల్లెలో దిక్కుమొక్కు
లేని కాలమున పొడిమిన నేను నేడు
కొంత తలయెత్తుకొని తిరుగుట ఘటిల్లె
దేవ! తావకచరణైక సేవగాడె.

తాను వరతంతుడే కాని నేను కాను
కౌత్సుడను-గాన లేలేత కైతనొసగి
గురుని ఋణమీగనెంచితి కొంతకొంత
తీరని ఋణమ్ము పూర్తిగా తీర్పదరమె?



# కాళోజీ

—ఎన్. గోపి

కన్నీళ్లు ఏడుంటే
కాళన్న ఆడుంటడు
కాళన్న ఏడుంటే
"కలేజా" గాండ్లు ఆడుంటరు
గోడు అడ్డం పడ్తది కాళన్నకు,
ఎంతో చిక్కు సంగతులను
"గింతే" అని తేల్చేస్తడు కాళన్న
మూడు అంతరాలు చూసి
లావు లావు ఎగుర్తాండు
దమ్మున్న పోరగాల్లను
రమ్మని సవాలు జేస్తాండు
కాళన్న ముంగల
నువ్వన్న మాటలే నీ మీదికి తిరగబడతై
కాళన్న వెనకాల
ఆయనన్న మాటలే వినబడతై
కాళన్న కవిత్వానికి
అక్షరాలు చాలై
కాళన్న గర్జిస్తే
కాయితాలు వొనుకుతై
కాళన్న మాటలు
పునాదులల్ల ఆడుకునే పసిపిల్లలు

సౌసుగుల్లేవు
ముసుగుల్లేవు
సిసలైన వ్యవహారం కాళన్నది
కాళన్న అడుగు పెట్టిన ఇల్లు
కాళన్న మెట్టిన ఇల్లే
కాదంటే ఆ ఇల్లాలు
కాళన్న ఒడిలో పిల్లే
కాళోజీ అడుగులు పడ్తే చాలు
'కాళోజీ తాత' అంటూ
వీధులు వెంట బడతై
నువ్వాయనకోసం పోయినప్పుడు
నీ కోసం ఆయన
మీ యింట్లుంటడు
కవిత్వాలు కాయిదాలు
చదువుకున్నోన్ని అటుబెట్టు
కష్టనిష్ఠూరాలు తెలిసిన ప్రతోడు
కాళన్న ముందు కరిగిపోతడు
కష్టినిష్ఠూరాలు రెండూ
కాళన్న ముందు కరిగిపోతయి
కాళన్న ఒక మెత్తని వజ్రం
కాళన్న కాళన్నే

# కుందుర్తి

—బండ్లమూడి సత్యనారాయణ

నరుండు నరుండుగ, తానే
హరిగా సరిక్రొత్త గీత నాలాపించెన్
సరళాంధ్రభాష నెవ్వఁడా
వరకవి "కుందుర్తి" నెంతు పల్మరు శ్రద్ధన్.

కలము హలమ్ముగ, నక్షర
ములు బీజములుగ, మహార్థములు సస్యముగా
ఇల కొసగిన సుకవికృషీ
వలునిన్ "కుందుర్తి" నెంతు పల్మరు భక్తిన్.

వచనకవితాచతుర్ముఖు
నచలస్థిరు, విశ్వనాధు నంతే వాసిన్
శుచిముఖు, వందితసత్కవి
నిచయున్-కుందుర్తి ఆంజనేయు స్మరింతున్

నవకవితా "భాష్యంకరు"
యువకవి నిర్దేశికున్, మహోద్యమనేతన్
రవికవినిభు, నభినవ భా
రవినిన్ "కుందుర్తి" నెంతు రమ్యానుకృతిన్.

షష్టిపూర్తి మహము జరుగక మున్న నూ
రేండ్లు ముగిసె నతని; కింకమీద
షష్టిపూర్తులెన్నొ జరిపించుకొనుగాత!
యుగయుగాన నతని ప్రగతి గీత.

# ఎస్. టి. జ్ఞానానందకవి

నా శిష్యుండును సాధువౌకవియు జ్ఞానానంద మీసాధువే
శాశిష్టంబు నదృష్టమందెడిని వాల్లభ్యంబు దీపింపగన్
ఆశీర్యోగ్యుడు యోగ్యుడున్ నవశుభ ప్రారంభసంపత్తికిన్
ఆశీస్సంతతినిత్తు నీ శుభవివాహస్వచ్ఛవేళన్ బడిన్.

—విశ్వనాథ

రిక్షాపై కవిరాజు శుభ్రతరకీర్తి ప్రోల్లసద్దేహుడై
దీక్షాదక్షత కాకినాడ పురవీధీరమ్య తేజస్వియై
సాక్షాత్ శ్రీ కవిసార్వభౌముడనగా సంచారము జేసెడిన్
అక్షీణాంధ్రకవిత్వధూర్వహుడు జ్ఞానానందు డుత్సాహియై.

—గుబ్బల మాధవమూర్తి

పలికితివా పచ్చిబండలు బ్రద్దలై
        జల జలనానంద జలములూరు
పాడితివా సర్వపండితామోదమై
        భళిభళి! యన్న శబ్దములు మొలుచు.
వ్రాసితివా నవరసములు చిప్పిల్ల
        మధురకావ్యంబులై మహిని నిల్చు
కదిలితివా మహాకవికుంజరములు
        గుంపులై నీముందు సొంపుదనరు.

సాహితీకృషీవల నీదు సస్యరమయు
పండి పులకించె కీర్తి సంపదలతోడ
తనరు నీ వామపాదపద్మమ్మునందు
గండపెండేర మీనాడు ఘల్లుమనియె.

—ఎం. పి. జానుకవి

జ్ఞానానందకవీంద్రు డొక్కరుఁడు ప్రజ్ఞాశాలి పూర్వాంధ్ర వి
జ్ఞానాంభోధి; గంభీరుం డీహితుని వాజ్నైపుణ్యమగ్గింపగా
లేనంచున్ వచియించె నొక్కరుడు మీ వృత్తాంత మాలించితిన్
ఏ నెంతో ముదమందితిన్ కవి। తిమోతీ! పద్యకావ్యాకృతీ!

అతడు కవిసార్వభౌముడు
అతడు రసకళాప్రపూర్ణు డద్భుతకృతి స
మ్మతి కవిజ్ఞానానందుం
డత డాకవిపొందుగాత మైశ్వరంబుల్.

—ఆచార్య తిరుమల

కలమెత్తినా
గళమెత్తినా
జ్ఞానానందకవి
జనావళిని అలరిస్తారు

—దాశరధి



# ఏ రుద్రుడో ఈ ఆరుద్రుడు

—జె. బాపురెడ్డి

షష్టిపూర్తి చేస్తున్నారా
జరామరణాలు లేని ఋషికి
దేశ కాలాతీత మనిషికి
భద్రునికీ, నిర్నిద్రునికి
ఆరుద్రునికి-
సృష్టిచేసే దృష్టికలవానికి
కష్టించే పుష్టికలవానికి
నిలకడలేని వయస్సును
నిశ్చల తపస్సులో నిలిపివేసినవానికి
షష్టిపూర్తి చేస్తున్నారా!
అంధకార బంధురమైన
ఆంధ్రసాహిత్య చరిత్రను
అక్షరకాంతి చిత్రలహరిలో ఆవిష్కరించిన
అపూర్వభావగంగాధరునికి
నిత్యసత్య జీవనశిఖరాల మీద
నిరంతర చిరంతన నాట్యంచేసే
క్షేమరామ సాంబశివునికి
హరునికీ శివంకరునికీ
అరవై ఏళ్లు వచ్చాయని
ఆర్భాటం చేయటం
అమాయకత్వం కాదా!

మామూలు మనిషితో
శాంతిదూత మహాత్మునితో
క్రాంతినేత కార్ల్ మార్క్సుతో
జర్జరుడైన జీవునితో
నిర్జరుడైన దేవునితో
"త్వమేవాహంగా" తాదాత్మ్యంచెందిన
ప్రగతిశీలికి ప్రతిభాశాలికి
నిత్యపరిణామ సత్యశూలికి
వచ్చినవి ఆరుపదులుకాదు
అరవై వసంతాలు తెచ్చిన
అమృత సాహిత్యనిధులు-
కోటికోటి తెలుగు కంఠకల కంఠాలు
కీర్తించేది
ఏ రుద్రుడినో కాదు
అసలైన ఆరుద్రుడిన్నే
అనమాన శక్తి సంయుక్తుడైన
ఈ ఆరుద్రుడిన్నే !



# దాశరథీ

—సి. నారాయణరెడ్డి

"దాశరథీ! మనోజ్ఞకవితాశరధీ! శరదిందు చంద్రికా
పేశల కావ్యఖండముల పిండిన నీ కలమందునన్ మహో
గ్రాశనిపాతముల్ వెలయునౌర! మహేశుని కంటిలో సుధా
రాశి తరంగముల్ కటు హలాహల కీలలు పొంగినట్లుగా"

*　　　　*　　　　*

"నా తరుణ కావ్యలతికలానాడు పైకి
ప్రాకలేక దిక్కులు సూడ; నీ కరాలు
సాచి లేతరేకులకు కెంజాయలద్ది
మించు పందిళ్లపైకి ప్రాకించినావు"

*　　　　*　　　　*

"కలకాలమ్ములు నీవునేనిటువలె స్నిగ్ధస్నేహబంధాల బ
ద్ధులమై యుందము, ఏకగీతి నిరుగొంతుల్ విప్పి విన్పింత, మాం
ధ్రుల చైతన్య విపంచికావళులు విద్యున్నాదముల్ సేయగా
జలపాతమ్ములవోలె దూకుదము విశ్వక్సాహితీశృంగముల్"



# సూర్యుని జన్మదినం

(గుంటూరు శేషేంద్ర శర్మ)

—తంగిరాల సుబ్బారావు

భూమికి జన్మదినం విరగబండిన పంట చేను
సముద్రానికి జన్మదినం నిండు పున్నమి వెన్నెల
అగ్నికి జన్మదినం మెరుపులు ఉమిసే పిడుగు
గాలికి జన్మదినం అడవి చెట్లను కరకర నమిలే తుపాను
ఆకాశానికి జన్మదినం అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడు
మరి ఆ బాలభానుని జన్మదినం ?
అరుణకిరణాల అక్షరాల్ని జుర్రే
కైపెక్కిన తరుణలోకం కన్నుల కెందామరలు !

ఓ మంటల భాస్కరుడా !
నువ్వు పంటలు కోసే కొడవళ్ల కన్నీళ్ళు తుడిచావు
వెన్నెల త్రాగే చకోరాల కిలకిలలు విని పులకించావు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగుల గర్జనలు ప్రతిధ్వనించావు
నిట్టూర్పుల తుపానుల్ని ఓదార్చావు
నీ ఒడిలో సేద తీర్చావు
శిఖరాల మీద సూర్యుడు నాటిన ఎర్రజెండాల ముందు
మానవతా జాతీయ గీతాలు ఆలపించావు
ప్రభవనుంచి అక్షయంలోకి ప్రవహించే కాలఋతుచక్రంలో
పిట్టల పాటలు వెలిగించిన చెట్లమీది వసంతాలు తిలకించావు !

ఓ కావ్య ఫణీంద్రా!
నిత్యం నీ నాలుక గున్నమామిడి మీద వాలే వాల్మీకి కోకిలగానం
మెట్లుమెట్లుగా పైకి ఆనంద శిఖరాలకు........

విషాద ధూమంగా క్రమ్ముతూ నీ గుండెను పట్టి పిండుతూ
అశోకవనాన్ని చీల్చుకొని వచ్చే జానకీశోకం
బొట్లు బొట్లుగా క్రిందికి తమస్సుల అఖాతంలోకి........

ఎదురుగా
విధుర విషాద గీతాల్ని అణిచి వేసే
కన్నుల మిరుమిట్లు గొలిపే సౌందర్యకాంతి
మనసుకు మయూర నృత్యాల శాంతి!
రంగురంగుల కలల భ్రష్టునీ ప్రతిశారక్తంలో ముంచి
ఈ జనతా హృదయ చిత్రాలకు మెరుగులు దిద్దుతావు
మా మీద ఇంద్రధనుస్సుల పందిళ్లు పరుస్తావు
ఇంద్రజాల మహేంద్ర జాలాలతో మెస్మరైజ్ చేస్తావు........
కవితా రసధునిలో పడి
కరిగిపోయిన ఓ వెండి జాబిల్లీ!
ఒకే సమయంలో నీలో చూస్తాను ద్వంద్వాలు
అమృతం-విషం,
అగ్ని-హిమం,
షాంపేన్-నాటుసారా,
సుఖదుఃఖాలు,
మరుజువానా-స్పెషల్ చ్యవనప్రాస
హిరాయిన్-మహా కనక సిందూర భస్మం
క్లోరోఫిల్ చచ్చిన ఎండుగడ్డి కవితకు
కాయకల్ప చికిత్స చేసిన అపర ధన్వంతరివి
మూర్ఛ పోయిన లక్ష్మన్న పాలిటి సంజీవ రాయడివి.

విస్పన్న చెప్పింది వేదం-అది వెర్డిక్ట్!
నీ గొంతుకకు నేను ఎడిక్ట్!
రాముడు, కృష్ణుడు, రామకృష్ణుడు గురు గౌరిశంకర శిఖరాలు

హనుమంతుడు అర్జునుడు నరేంద్రుడు శిష్యత్రిశూలాలు
విశ్వనాథకు జువ్వాది గౌతమ్....
ఓ మండే సూర్యుడా !
నీ వెలుగు ముందు
నేనూ నా చీకటీ
ఖతమ్ !
ఇది
నీకు అంకితమ్ !!



# అశ్వత్థవృక్షం

(ఇస్మాయిల్)

—ఆచార్య తిరుమల

గుండె పొలంలో
కవితాక్షరాన్ని
విత్తనంగా నాటి
కాంతి మండలాన్ని
పండించిన
ఆనంద సీమల నవాబు
సమాజపు ప్రశ్నలకు జవాబు
ఇస్మాయిల్ !
భాషా విభేదం లేదు
భావ విరోధం లేదు.
ఆ కంటికి కంటకం లేదు
ఆ మాటకు సంకటం రాదు
అది ఆకాశ సారాన్ని
పీల్చుకొంటున్న కవితా పత్రం?
అది అంబోధి గాంభీర్యాన్ని
పుడిసిలిస్తున్న సహృదయ నేత్రం!
ఇస్మాయిల్
మామూలు చెట్టు కాదు !
ఊర్ధ్వమూలంతో
భాసిస్తున్న
బ్రహ్మాశ్వత్థ వృక్షం!

అది మానవ తాంతర
కృష్ణపక్షం మీదవాలిన
శుక్ల పక్షం !!
అది అక్షయం !
అది అమృతం !
అది అనంతం !!



# కృష్ణా తరంగిణి

(నాయని కృష్ణకుమారి)

— ఎల్లూరి శివారెడ్డి

నేను పుట్టకముందు నుంచీ
ప్రవహిస్తూనే ఉంది కృష్ణ
నా చూపు చూడలేనంత వరకూ
సాగిపోతూనే ఉంటుంది కృష్ణ.

జనపదాల జీవితాలు
రసవంతం చేస్తూ
జ్ఞానపథతీర్థాలను
సారవంతం చేస్తూ
సాగిపోతూనే ఉంది కృష్ణ
జ్ఞానసాగరంలా ఉంది కృష్ణ,

ఈ గడ్డమీద గడిదేరిన
గేయగాథలు ఆలాపిస్తూ
హృదయంలో చెలరేగిన
భావగీతికలు వినిపిస్తూ
ఆగకుండా సాగిపోతున్నది కృష్ణ
సాగిపోతూ ఆగిచూస్తున్నది కృష్ణ.

తాను సాగినచోట
సౌభాగ్యతిలకాన్ని దిద్దింది కృష్ణ
తాను ఆగినచోట
వెలుగుల లోగిళ్లు నిలిపింది కృష్ణ.

ఈ శ్రీ పర్వతం పైన
కాశ్మీర దీపకళికలు నిలిపింది కృష్ణ
అమరావతి హృదయంలా
ఆంధ్రుల కథ వినిపించింది కృష్ణ.

నెలయేళ్లకు ఆచార్యత్వం వహించి
సాగరాలుగా తీర్చింది కృష్ణ
తృష్ణాపరులకు వేడితే నీరు
ఇచ్చింది కృష్ణ.

అందరిది ఇది సుమా అని
అమరభాషను వినిపించింది కృష్ణ
పసిడి మనసున్న పల్లె పలుకు కే
పట్టం కట్టింది కృష్ణ.

ఉప్పొంగి ప్రవహించిన క్షేత్రంలో
ఉత్తుంగ భద్రాసనం నిలిపింది కృష్ణ
త్రిలింగంలో సారంగంలా
పరుగులు తీసింది కృష్ణ.

ఈ అగ్నిపుత్రి అంకం
తెలుగునేలకే బింకం
ఈ నదీమాత సహనం
తెలుగు భాసకే చందనపంకం.

ఈ చిరుచీకటిని తొలగింతునాయని
తళతళా మెరిసింది కృష్ణ
నేను చెప్పింది విను నాయనాయని
గలగలా పలికింది కృష్ణ.

తనను కొలిచే కాలానికి
కథలు చెప్పింది కృష్ణ
తనను దరిసో మలయపవనాలను
ఉపదేశమధువు ఇచ్చింది కృష్ణ.

కాలచక్రభ్రమణంలో షష్ట్యబ్దులుగా
వసంతాలు వచ్చిపోతున్నా
ఎప్పటికీ విశ్రమించదు కృష్ణ
ఎన్నటికీ తీరదు ఈ విజ్ఞాన తృష్ణ.
ఏం చెప్పను నేస్తం అంటూ
ఎంతో చెప్పింది కృష్ణ
ఏ భాషలో తాను పలికినా
అమృతం కురిసింది కృష్ణ.

శరత్తులో తేటగా ప్రవహించి
అరుణకిరణాలలో అభ్యుదయం వీక్షించి
కృష్ణపక్షంలో ఇంద్రనీలమణిహారంలా గోచరించి
మధుసూదనుని మందిరంవైపు
మెల్లగా నడిచింది కృష్ణ
కడుపు చల్లగా వెలిగింది కృష్ణ.

నేను పుట్టకముందు నుంచీ
ప్రవహిస్తూనే ఉంది కృష్ణ
నాచూపు చూడలేనంతవరకూ
సాగిపోతూనే ఉంటుంది కృష్ణ.



# నారాయణరెడ్డి

—ఎస్. టి. జ్ఞానానందకవి

ఈ నవ్యోదయప్రక్రియప్రగతికిన్ హేరాళసాహిత్యని
ర్మాణానూన రసైకకల్పనలకున్ మంజూషమ్మగానిల్చి యాం
ధ్రానన్ దొడ్డయశస్సునందిన కవీణ్మార్తాండుడైనట్టి శ్రీ
సి. నారాయణరెడ్డి కయ్యేడును రాశీభూతసౌభాగ్యముల్.

తప్పగు వ్యర్థశబ్దములదాటిని మూర్కొని ద్వేషసాహితిన్
దొప్పలాడుభావములఁ దున్ని మహోన్నతభావనాపదా
లొప్ప రచించు రెడ్డి మధురోహలతో వెలిగ్రక్కు శబ్దపున్
గప్పురముల్ దిశాంచలము నాచికొనెన్ బుధులుగ్గడింపగన్.

ఈ విశ్వంభర మెచ్చుకొన్నయది సాహిత్య ప్రపంచమ్ములో
ఈ విశ్వంభర నిల్చిపోయివది రెడ్డీంద్రుండు ఘంటాన మే
ధావైదుష్యముజొన్ప సర్వమత సత్యంబైన సూత్రాలచే
నావిష్కారముసేయు రెడ్డికి శుభాలౌగాక యెల్లప్పుడున్.

ఎడదన్ సంస్కృతి దివ్యగంధము గమాయింపన్ పురాణించు ము
ఖ్యుడిగా మానవతామహోజ్జ్వలమషాభావమ్ము స్వాంతాన నె
ప్పుడు మేల్పేయుటకే ప్రయత్నములు సల్పున్ సాహితీలోకచం
ద్రుడు రెడ్డీంద్రుడు నట్టి రెడ్డికగుతన్ పూర్ణాయురారోగ్యముల్.

తెలుగుల్ మెప్పులగాంచి గేయకవితాయదీపాలు వెల్గించి జా
జాతిని నిద్రాణమునుండి మేల్కొలుప నుత్తేజమ్ము గల్గింపబూ
నిన సంస్కారగుణైబంధువునకున్ శ్రీ సింగిరెడ్డ్యన్వయో
న్మణికిన్ రెడ్డికి ప్రోన్నతాశయునకున్ సంధిల్లు సుశ్రేయముల్.

తేనియలూరునట్లు గడిదేరిన వీణియమీటినట్లు కం
ఠాన సహస్రకోకిలలనాదము లొక్కటియైనట్లు పొం
కాన పఠించువేళ తనకావ్యములన్ జగమంత తన్వయ
త్వానమునుంగు నిద్ధి సుకృతంబగు రెడ్డికి ధీవివేకికిన్

వాసినిగన్నయట్టి నిజవాసమునౌ హనుమాజిపేటలో
ఆ సిరిసిల్లలోఁ జదివినట్టి పదేడుల బాలకుండు నే
డీ సకలోర్వరన్ పరచె నింపుదలిర్పగ మేల్ కవిత్వమున్
ఆసవ మట్టియోగ్యునకు నర్హములౌత సమస్తసత్కృతుల్.

తెలుగునేలలోన కలకతా కేరళ
పొలములోన 'రషియ' భూమిలోన
బహుమతులనుగొన్న ప్రజ్ఞాధురీణుడౌ
సింగిరెడ్డికులుడు చెలగుగాక!

తనదైనట్టి యొకానొకండు రచనాతాత్పర్యమున్ గల్గి వ్రా
సిన సాహిత్యకళాబ్ధి కల్ల హనుమాజీపేట యబ్బాయికిన్
తెలుగున్ బాసకు పెద్దగా నిలిచి వన్నెల్ గూర్చు ధీశాలికిన్
మనసుంగల్గిన మానవోత్తమునకున్ రెడ్డీంద్రుకౌ సంపదల్.

హృదయముప్పొంగ నభ్యుదయసుకవితామ
హానల్పనగశిఖరాగ్ర మెక్కి
స్వేచ్ఛరాజింప మాత్రాచ్ఛందమందు క్రొం
జాలులో వేలగేయాలు వ్రాసి
మహితసత్ఫలలలో మకరందమధురిమల్
జాలువారగ ప్రసంగాలు సేసి
మానవత్వమ్మును మంటలోగలుపు
ర్ఘన్యపద్ధతుల తిరస్కరించి

84

ప్రతిభగాంచి మెచ్చి పట్టము గట్టెడు
ధీవరునకు మేత్రిభావుకునకు
దొడ్డగుణుడు సింగిరెడ్డి నారాయణ
రెడ్డికగుత వసుధ పృథులశయము.

ముద్గలగోత్రసంభవుడు మోహనరూపుడు సాహితీలసత్
ప్రోద్గగనప్రదేశపరిరూఢవిహారుడు రెడ్డిమోదియై
యుద్గళమెత్తి కావ్యముల నుజ్జ్వలఫక్కి పఠించుచో సఖా
చిద్గగనమ్ము తన్మయతజెందు విశేష మదెట్టిదోకదా !

నెమ్మి జామిచెట్టుకొమ్మల నీడలో
మధురకావ్యములను మలచి యొసగె
తెలుగులెల్ల మెచ్చ త్రిలోకమణిభూష
బుచ్చిమాంబసుతుడు బుధవిధుండు.



# ఉపయుక్త గ్రంథసూచి


1. అబ్బూరి వరదరాజేశ్వరరావు
   (కవితాసంచిక) 1993

2. అబ్బూరి శతజయంతి సంపుటి 1996

3. అరవై వసంతాల-అభినందన సంచిక
   వాసిరెడ్డి ప్రింటర్స్,
   అశోక్‌నగర్ 1989

4. ఆరుద్ర అభినందన సంచిక
   రాజరమణయ్య అండ్ కో.
   మద్రాసు 1985.

5. ఇస్మాయిల్ కవితలు
   ట్వింకిల్ పబ్లిషర్స్
   లచ్చిరాజు వీధి,
   కాకినాడ.

6. ఉదయశ్రీ (ప్రథమభాగం)
   50వ ముద్రణ 1986.

7. ఎఱ్ఱన సాహిత్యలహరి
   ఎఱ్ఱనపీఠం
   గాంధీరోడ్, ఒంగోలు.

8. కళాప్రపూర్ణ డా॥ ఎస్.టి. జ్ఞానానందకవి జీవితం
వాఙ్మయసూచి
డా॥ ఎస్. శరత్‌జ్యోత్స్నారాణి 1994
హైదరాబాదు-44.

9. కవితాంజలి. బండ్లమూడి సత్యనారాయణ

10. కాటూరివారి సాహితీ సమాలోచన
పింగళి వేంకట కృష్ణారావు
ప్రథమ ముద్రణ 1992.

11. చైతన్యకవిత
ప్రభవ వసంతం,
సంపాదకుడు, తంగిరాల సుబ్బారావు 1987.

12. తెనుగులెంక
తుమ్మల సీతారామమూర్తి
జీవితం-సాహిత్యం
కిషాన్ పబ్లికేషన్స్
చంద్రమౌళినగర్,
గుంటూరు.

13. పాలేరు నుంచి పద్మశ్రీ వరకు
శ్రీమతి హైమవతి
సన్మాన సంఘం ప్రచురణ-1978.

14. మధురస్మృతులు
శ్రీ నృసింహప్రియ
11వ వార్షిక సంచిక.

15. మహాకవి గుఱ్ఱం జాషువా శతజయంతి సంచిక 1995.

16. రాజధాని
రసజ్ఞ శ్రీ పబ్లికేషన్స్
కాకినాడ-3.

17. శారదరాత్రులు
ప్రథమ ప్రచురణ 1994
శనగన నరసింహాచార్యు
51-5-14, గుణదల,
విజయవాడ-520 004.

18. శ్రీ శ్రీ సంస్మరణ సంచిక
రంజని, సంపాదకుడు,
పి. నాగభూషణం,
ఏజీ. ఆఫీసు, తెలుగు సాహితీ సమితి,
హైదరాబాదు.

19. శృంగార శ్రీనాథము
ద్వితీయ ముద్రణ 1985
మణిమంజరీ ప్రచురణలు
వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు,
హైదరాబాదు-500 013.